180

సంపుటము 26 | శ్రీ | సంచిక 4

ఆంధ్రరాష్ట్ర

# ప్రారంభవిద్య

(విద్యావిషయిక మాసపత్రిక)

నవంబరు 1937.

సంపాదకులు.— శ్రీయుత జోశ్యుల వెంకటారావుగారు, బి.ఏ., బి.యిడి.,

విషయసూచిక.



వ్యవస్థాపకులు: శ్రీయుత ఈదర వెంకయ్యపంతులుగారు, ప్రొప్రయిటరు, రామా అండ్ కో., ఏలూరు.

సంవత్సర చందా రు 1-8-0
(పోస్టేజీతోసహా)

Printed by Mr. E. Venkayya
at his Pattabhirama Press

ఆంధ్రరాష్ట్ర

# ప్రారంభవిద్య




విద్యావిషయిక మాసపత్రిక.

| సంపుటము 26 | ఏలూరు—15 నవంబరు 1937. | సంచిక 4 |
|---|---|---|


## ప్రథమతరగతి.

(శ్రీపాద సుబ్రహ్మణ్యంగారు, R. K. G. R. Hr. El. స్కూలు పిఠాపురం)

విద్యాసౌధమునకు ప్రాథమిక పాఠశాలలు పునాదులవంటివి. ప్రాథమిక పాఠశాలలకు ప్రథమ తరగతి నావకు చుక్కానివంటిది. నవనాగరకత యభివృద్ధిఁజెందుచున్న నేఁడు ప్రాథమిక పాఠశాలలకును గ్రామములకును గల సంబంధమును విపులీకరించనవసరములేదు. రామాలయములవలె నేఁడీ కుటీరపాఠశాలలు ప్రతి మారుమూలకు గ్రామమునందును కలవనుట యతిశయోక్తి కానేరదు.

నేఁడు గ్రామపునర్నిర్మాణమునకై మహాత్ములనేకులు గ్రామపునర్నిర్మాణ సంఘములను స్థాపించి పాటుపడుచుండిరన్న సంగతి జగద్విదితమే. ఈసందర్భమున గ్రామపాఠశాలలనదగు నీపటకుటీర పాఠశాలలయందలి విద్యాభివృద్ధిఁ గాంక్షించుట నుచితము కానేరదు. దేశమునకు విద్యాసుగంధమిళిత మలయమారుతపు చల్లదనముఁ జూపగల్గిన యీగ్రామపాఠశాలలే. అట్టితరి వీనియందలి విద్యాభివృద్ధిఁ బరికింప నెంచుట దోషము కానొల్లదు.

ప్రాథమిక పాఠశాలలందలి ప్రథమతరగతి నావకు చుక్కానివంటిదని యితఃపూర్వమే చెప్పియుంటిమిగదా! ఈతరగతిఁగూర్చి కొంత యోచింతము. ఇందుబోధించవలసిన విషయము.

I వర్ణసమామ్నాయము

II. స్వరగుణితములు

III. ద్విత్వాక్షరములు

IV సంయుక్తాక్షరములు

V చిన్నచిన్న పాఠములు, పాటలు.

పైవిషయములను పదినెలలలో బాలురకు విసుగు జనించకుండునట్లు బోధించవలెను ఇయ్యది యాంధ్రమునకు సంబంధించినది. ఇదిగాక గణితము, లోకజ్ఞానము మొదలగు మఱికొన్ని విషయములకుఁది సంబంధించిన చిన్నచిన్న విషయ

ములఁగూడ బాలురకు పరిచయ మొనరింప నొప్పునని కొందరనుచుండిరి.

పైన ఐదుభాగములుగ విభజించిన యాంధ్ర విషయములఁ బది నెలలలో బోధించుటయెట్లు?

మొదటి నెలలో అచ్చులనన్నిటిని వ్రాయుట, యుచ్చరించుట నేర్పవలెను. మరుచటి నెలలో 'క' మొదలు 'ణ' వరకు బోధించి యీరెండు బరులలోను యే యక్షరము వ్రాయుమనిన ఆయక్షరము వ్రాయునట్లు, వ్రాసినయక్షరమును చదువునట్లు చేసి యీదిగువ మాదిరికి చూపిన చిన్నచిన్న పదములవంటి పదములను చెప్పవలెను. పైవిషయమునకు యీమాటల బోధయే పునర్విమర్శ (Revision) న యగును. ఇంతియకాక యీ మాటలవలన బాలురకుత్సాహమాధిక మగును.

మాదిరిమాటలు.—ఊక, ఈగ, ఆట, గడ, జడ, మొ॥

పైవిషయమును బోధించుటకు రెండునెలలు గతించినవి మూడవనెలలో మిగతరెండు బరులు అనగా 'త' మొదట 'ళ' వరకు నేర్పవలెను. అంతియకాక ఒక్కొక్క బరిపూర్తి కాగానే దానిపై మాటలఁగూడ బోధించవలెను.

మాదిరిమాటలు —పడమర, తలగడ, గరగర, సలసల మొ॥

ఇప్పటికి వర్ణసమామ్నాయము పూర్తియైనదన్నమాట - మరిపది, పదునేను దినములలో పైవిషయమునంతను పునర్విమర్శ చేయవలెను.

వర్ణసమామ్నాయముఁ బోధించునపు డుపాధ్యాయుఁడు ముఖ్యముగా యీదిగువవిషయములను గమనించవలెను.

కొన్ని వర్ణముల యాకృతిస్వల్ప భేదములు కల్గి ఒకేమాదిరిని ఉండును. ఈభేదములు బాలురు గుర్తించునట్లు చేయుచూ బోధించిన వారికి సులభమగును.

ఉదా॥ ఒ-బ, ము-య, న-స, ప-వ; ఫ-భ, శ-శ మొ॥

కొన్ని యక్షరములకు చ్చారణయందంత భేదము కానరాదు. అట్టి వర్ణములను బాలురచే స్పష్టముగాయుచ్చరించునట్లు చేయు టుచితము. ఉదా॥ చ, స, శ, థ ధ, ల ళ, ణ న, అహ మొ॥

పైయక్షర సమూహములకు గల స్వరభేదములను బాలురు గుర్తించునట్లుపాధ్యాయుఁడు దాహరణము లిచ్చుచూ బోధించవలెను.

కొందరుపాధ్యాయులు ఘు వ్రాయుటకు మారు'ఘు' వ్రాయుచుండిరి-'ధ' కు బదులు ధయును రకు బదులు ర యని గాని ర యని గాని వ్రాయుచుండుట అచ్చటచట పొడగట్టుచున్నది. ఇట్టి స్ఖాలిత్యములుపాధ్యాయుల యజాగ్రతఁ జూపును. కాని యుపాధ్యాయులను పాఠశాలకు పోవుటకు ముందు పదునైదిరువది నిముసములు తాము బోధించదలచు కొన్ని విషయములఁ గూర్చి చక్కఁగ విమర్శించుకొని పోవుచుండవలెనని హెచ్చరించుట యుక్తము కానొల్లదు.

మరియొక విషయము -వాచక పుస్తకములందు కొన్నిటియందు 'ళ' ను 'ల' తర్వాతను మరికొన్నిటియందు 'హ' తరువాతనున్న వ్రాయుచున్నారు. కాని బాలవ్యాకరణము మున్నగు వ్యాకరణ పొత్తములందు మాత్రము యీ 'ళ' ను హాకు పిమ్మటనే వ్రాయుచున్నారు! 'క్ష' వర్ణాంతరముకాని వర్ణసమామ్నాయమందలి యక్షరముకాదు. దీనిని వర్ణసమామ్నాయమునందు చేర్చుట పొరబాటు

స్వరగుణితములు -స్వరగుణితములనగా స్వరములచే హల్లులఁగుణించుట అనగా హల్లులకు అచ్చులను చేర్చుట. క్ + అ=క, గ్ + ఆ=గా మొ॥ ప్రస్తుతమీ గుణితములు రెండు పద్ధతులపై బోధింపఁబడుచున్నవి.

1 ఒకే ప్రాణమును (అచ్చును) వివిధహల్లులకు చేర్చుచూ, దీర్ఘములను గుళ్ళను, గుణిదీర్ఘ

ములను కొమ్ములు మొదలగు వానిని నేర్పుట ఇది నవీనపద్ధతి

11. అచ్చులన్నిటిని ఒకేహల్లునకుఁజేర్చుచు, 'క' గుణితము 'గ' గుణితము మొదలగు గణితములన్నేర్పుట ఇది ప్రాచీనపద్ధతి.

నవీనపద్ధతి ప్రకారము 'క' గుణితముగాని'ఁ' గుణితముగాని వ్రాయమనరాదు అట్లన్ననిూ బాలురు వ్రాయలేరు దీర్ఘములు గాని గుణ్ఠులుగాని కొమ్ములు గాని వ్రాయమనవలెను. ప్రాచీన పద్ధతిపై దానికి విరుద్ధము ఈ రెంటియందలి బాగోగులఁజూతుముఁ.

నవీనపద్ధతిపై దీర్ఘములు, గుణ్ఠు, కొమ్ములు మొదలగునవినేర్పుట సక్రమపద్ధతి ఏలన అచ్చులను బోధించిన క్రమములో వానిని హల్లులకు చేర్చి బోధించకుండుటే! అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, అనుచూ అచ్చులను బోధించి 'కా' కకు దీర్ఘమిస్తే 'కా' 'గ' కు దీర్ఘమిస్తే గా అనుచూ దీర్ఘములు గుణ్ఠుక్రమమును బోధించుట యుక్రమ పద్ధతి కాదా?

ప్రాచీన పద్ధతి ప్రకారమన్ననో, గణితములను క్రమపద్ధతిగ బోధించవచ్చును. అచ్చులను చెప్పిన క్రమము తప్పకుండ వానిని హల్లులకు చేర్చుచుండవచ్చును

నవీన పద్ధతిపై గుణితములను నేర్పినచో త్వరతర్వగా మాటలను నేర్పవచ్చునట ఎట్లు? దీర్ఘములైన బాలునికి 'కాయ, బావ, తాత, తామర' మొదలగు అన్ని దీర్ఘములపై మాటలనూ చెప్పవచ్చునట

ప్రాచీనపద్ధతిపై 'క' గుణితమును పూర్తిచేసిన బాలుడు కాయ, కామ, కాడ, కీడ, కేక, కోట, కైక, మొదలగు వివిధస్వరముల సంయోగమువలన ఒకేహల్లుతో నేర్పడు వివిధములగు మాటలను వ్రాయుట లేదా?

మరియొక ముఖ్యాంశముఁ గమనింపుడు. నవీనపద్ధతిపై గుణితములను నేర్పినచో ధ్వని భేదములను బాలురు బాగుగా గుర్తింతురట. కాని యీ పద్ధతి ప్రకారము బోధించినచో, వివిధ హల్లులపై ఒకే అచ్చును అనగా యేదీర్ఘమునో, కొమ్మునో చేర్చుచూ పోవుటవలన, హల్లుల ధ్వనికి గల భేదమునే గుర్తించనగును. ఈ భేదము వర్ణసమామ్నాయము బోధించునప్పుడే బోధింతురు. ఇచట అనవసరము.

ప్రాచీన పద్ధతిపై నేర్పినచో అక్షరసంయోగముువలన ధ్వనియందేర్పడు భేదమును గుర్తించి, అచ్చుల క్రమమున నేగుణితమొల్లు సాగుచున్నది. బాలురు కొన్ని గుణితములను పూర్తిచేయునప్పటికి, గ్రహింతురు ధ్వని కలవి అచ్చులు కాని హల్లులు కావు. హల్లులు ప్రాణయుక్తములైనప్పుడే యుచ్చరితములగును. కాన ధ్వనియందివి భేదమును గుర్తించుటకు హల్భేదముకంటె అచ్చుభేదమే యవసరము.

నవీన పద్ధతి ప్రకారము స్వరగుణితముల నేర్పవలెనన్నచో వర్ణసమామ్నాయమందలి హల్లులను మాత్రమే ముందు నేర్పవలెను. పిమ్మట ఒక్కొక్క అచ్చున దాని గుర్తును గుర్తునామమును నేర్పుచూ ఆ గుర్తును హల్లునకు చేర్చు విధమును నేర్పి దీర్ఘములు, గుణ్ఠు వగైరాలను బోధించవలసి యుండును. అప్పుడది శాస్త్రీయమగు పద్ధతియగును. అంతియకాని అచ్చులను నేర్పి మరియొక క్రమమున గుణితమును నేర్పుటశాస్త్రీయమగును. అదియుఁగాకఁ వర్ణసమామ్నాయమును నేర్పునపుడు మాటలను నేర్పుట కిష్టము కూడ కాగలదు. ఈపద్ధతిపై నేర్పుటకు మరియొక చిక్కు కూడ కలదు. ఏమన అచ్చుగుర్తుల నామములతో బాలురను పరిచయ మొనరింప వలసియుండును. 'క' కు దీర్ఘమిస్తే 'కా' 'గ' కు గుడిస్తే 'గి' యనుటలో బాలుడు

దీర్ఘమనగా 'ఆ' కు పర్యాయముగా వచ్చిన గుర్తనియు 'క్' కు 'ఆ' కలుపుటే 'కా' యనియు నూహించుకొనవలసియుండును అనగా బాలునికి కొంత (Mental Process) మానసిక క్లేశము హెచ్చును.

ప్రాచీన పద్ధతి ప్రకారము స్వరగుణితము బోధించినచో బాలురీతల ముళ్లు, గుళ్లు మొదలగు గుర్తులకును వానిని సంపూర్ణాక్షరములకుం గల సంబంధము త్వరగా నూహించుకొనుటకు వీలగును. ఏలన యీపద్ధతి పైగుణితము బోధించునపు డుపాధ్యాయుండాగుర్తుల పేర్లం జెప్పి బాలురను విసిగించక, 'క' కు దీర్ఘమిస్తే 'కా' యనక 'క' కార 'ఆ' కారములు 'కా' యనుచూ హల్లులకును అచ్చులకును గల సంబంధమును తిన్నగ (Direct) గా చూపుచున్నాండు. ఇట్లే గుణితమంతయు అచ్చుల నుచ్చరించుచూ నేర్పగలండు. తిన్నగా అచ్చు నీహల్లుతో కలిపి యుచ్చరించుటవలన బాలునికి, దీర్ఘము = ఆ, గుడి=ఇ, యని యూహించుకొని పిమ్మట దీర్ఘము తగిలించుటనగా 'ఆ' ను హల్లుతో చేర్చుటే యనియు, గుడియనగా 'ఇ' యొక్క సంయోగమే యనియు నూహించుకొనవలసిన మానసిక క్లేశము తగ్గును ఇట్టి సౌలభ్య మీ ప్రాచీనపద్ధతిపై గుణితము నేర్పుటవలన కలుగును.

కాని యర్వాచీనులు 'క' కు దీర్ఘమిస్తే 'కా' యనుచు యచ్చుగుర్తులతోనే గుణితముల న్నేర్పుట యుక్తము అందురు. ఏలన యీగుర్తులనే హల్లులకు తగిలించి కా, కి మొ॥ వ్రాయుచుంటిమి. కాని ఆ S' ఇ S యనుచూ అచ్చులం జేర్చివ్రాయుటలేదు. అందువలన వేనిని హల్లులకు చేర్చుచుంటిమో గుర్తులపేర్లనే హల్లులతో చేర్చి బోధించుట యుక్తమందురు. ఇది సత్యేతరము కానొల్లదు. కాని బాలుర మానసిక పటుత్వముం (Mental capacity) గూర్చి కూడ యుపాధ్యాయుండు యోజించుట ప్రధానకర్తవ్యమై యున్నది. కొన్ని గుణితములైన పిమ్మట, ప్రతిగుణితము నందును 'క' కారకారములు కా యనియు, 'గ' కారాకారముల 'గా' యనియు నేర్పుచుంటచే 'ా' గుర్తుంజేర్చి క కార ఆ కారము లనుచుంటచే దీర్ఘపు గుర్తునకును 'ఆ' యను యచ్చునకును గల సంబంధమును బాలురే గ్రహింతురు. ఉపాధ్యాయుండు బోధించినవిషయములకంటె బాలురు తామీరీతిని ఉదాహరణములవలన గ్రహించిన విషయములను యెన్నటికిని మరువకుండ జ్ఞప్తియందుంచుకొందురు. మన స్తత్వ శాస్త్రరీతిగ (Psychological) చూచినచో ప్రాచిన పద్ధతియే శ్రేష్ఠమేమో యనిపించుచున్నది.

మరియుం గొందరుపాధ్యాయులే 'క' కార 'ఆ' కారములు, 'గ' కార 'ఇ' కారములుయనుటలో గల కారములం జూచి కారములు మిరియములు నూరుచుండిరి. ఇది మిక్కిలి శోచనీయము ఉపాధ్యాయుల విద్యాదౌర్బల్య ద్యోతకము. ఏలన 'వర్ణాత్ కారః, యని పాణిని యీ కార ప్రత్యయము నంగీకరించి యున్నాండు. ఆధునిక వ్యాకరణ కర్తలుకూడ దీనిం ద్రోసి రాజనుటలేదు. అధునాత నాంధ్ర వ్యాకరణ గ్రంథకర్తలంబట్టి చూచిననూ, ప్రాచీన సంస్కృత వ్యాకరణ గ్రంథకర్తలం బట్టి చూచిననూ, 'క 'కార ఆ' కారము, 'ఈ' కారము అనుచూ యచ్చులం జేర్చి చెప్పుటయే వారల యాచారమై యున్నట్లు తోంచుచున్నది. అదియుంగాక నన్నయకాలపు నాటి యక్కరముల తీరుం బరికించి ఆకాలమునాటి స్వరగుణితముదిలకింపుండు. నాడుహల్లునకు అచ్చునే చేర్చుచుండిరి. కాని ఆయచ్చునకొక గుర్తున్నట్లు కానరాదు. ఉదా: నన్నయకాలపు 'అ' ◡ ఇట్లుండెడిది. నేటి ఉత్వపు గుర్తైన కొమ్మువలె 'అ'

యుండెడిది. నేటి 'కీ' ఆనాడు పొల్లు రహితముగ 'S' యిట్లు కాన్పించుచున్నది. ఈ రెంటి సంయోగము S + ◡ (క్ + అ) 'కు' (క) అయిన దేకాని, 'S' యీపొల్లుపై అచ్చుగుర్తు కానవచ్చుటలేదు - ఇట్లే మిగిలిన యన్ని యచ్చుల విషయము యూహించుకొనుట - వ్యాస విస్తరభీతిచే యుదాహరణములు బహుళముగనీయలేదు. కుతూహలము కలవారు ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము నందలి 'అక్షరములు' అను శీర్షిక క్రింది వ్యాసముఁగాని, నారాయణీయాంధ్ర వ్యాకరణమునందు ౬౨ వ పుటఁగాని చూడనగును.

ఈ దిగువ యప్పకవి పద్యముఁ బట్టిచూచిన యమ్మహానీయుని కాలమునకు ముందే యెప్పుడో యచ్చులకు గుర్తు లేర్పడినట్లు తోచుచున్నది.

క. "పొల్లులె తాముఘటియు
హల్లులు ప్రాణములతోడ నంబుధితనయా
వల్లభ కూడిక దాతల
ముళ్లు, గుడులు, శృంగములును
మొదలుగ దాల్చున్"

కొన్ని విశేషాంశములు — 'ఖ' యను నక్షరమునకున్ను మొదటి మూఁడు వర్గాంతాక్షరములకున్నూ అత్వపు గుర్తైన తలకట్టు కానవచ్చుటలేదు. 'ఆ' కు గుర్తగు '—ా' దీర్ఘము 'హ' కు చేర్చినపుడు '—ా' యీపొల్లుయొక్క యాకృతిఁ దాల్చుచున్నది. అనగ హ + ఆ = 'హా' 'య' కు 'ఇ' త్వపుగుర్తైన ' ి 'గుడిని చేర్చకతలకట్టుఁదీసినంతమాత్రముచేత నేయకారయికారము లగుచున్నది. మరి ఉకారమునకు గుర్తగు 'ు' కొమ్మును హల్లునకు చేర్చునపుడు అకారపు గుర్తగు తలకట్టునుకూడా అట్లే యుంచుచుండిరి. కాని వర్ణక్రమము చెప్పునప్పుడు క కార ఉకారములు 'కు' అనుచుండిరే కాని క కార అకార ఉకారము లనుటలేదు. ఇట్లే 'ఋ' కార 'ౠ' కారములు హల్లులకు చేరునప్పుడుకూడ తలకట్టు నిలిచే యుండు చున్నది. ఎ, ఏ, ఐ, లు అన్ని హల్లులకును సరిగాచేరుచున్నవి. ఒ, ఓ, ఔ లు హల్లులకు చేరునపుడు 'మ', 'య' లు నూతన మార్గములఁ జూపు చున్నవి మ + ఒ = మొ, మ + ఓ = మో, మ + ఔ = మౌ యగుచున్నవి. ఇట్లే యకారవిషయముఁగూడ యోజించునది. కాని యీ యక్షరములకు మరియొక రూపము కూడ కాన్పించు చున్నది చూడుడు.

మొ = మొ, మో = మో ఇట్లే 'య' కును నగు 'ఔ' యీ 'మ', 'య' లతో సంధించునపుడు తలకట్టు స్థానములో రాక వీనికిఁగల కొమ్ములతో చేరుచున్నది.

'మ, య' ల మిగిలిన హల్లులకు ఒత్వమిచ్చునపుడు కొ, నొ మొ॥ లగు రెండవ రూపమిచ్చుటలో మార్గదర్శకములైనవి. ట, ణ మొదలైనవి వ్యవస్థకు చిక్కక టొ, ణొ యనియే యున్నవి. వొ ను కొందరు 'వొ' యని వ్రాయుచుండిరి. ఇదతప్పు కొంతకాలమునకీ రెండవరూపములే కొ, గొ, మొ॥ యములు లోనికి వచ్చునేమో?

స్వరగుణితముల న్నేర్పునపుడు కొందరుపాధ్యాయులు పైవిషయములఁ గమనింపక కొన్ని హల్లులకుమాత్రము దీర్ఘముఁ జేర్పించి మిగిలినవన్ని యిట్లే యను చుండిరి. బాలురు హా ను హా యని వ్రాయుటప్పుడు తప్పు కానేరదు. ఇట్లే పైనఁ జూపిన 'ఋ' మొదలగు వానిఁ విషయము కూడ యోజించుకొని యుపాధ్యాయులు ప్రతియచ్చునూ ప్రతిహల్లునకుఁ జేర్పించి తదాకృతిఁ బాలురు గుర్తించునట్లు చేసి సరియగు నుచ్చారణమును స్పష్టముగ బోధించనగు పూర్వము 'క' మొదలు 'ళ' వరకుఁ గల ప్రతి గుణితమును నేర్పుటవలననే నాటి విద్యార్థుల

వ్రాతలందు వర్ణక్రమ (Spelling) దోషము లంతగ కానవచ్చుటలేదు.

అటియుఁగాక నేడు కొందరుపాధ్యాయులు ఎ, ఏ, ఐ, ఒ, ఓ, లను హల్లులకు జేర్చునపుడు క కు ఎత్వమిస్తే కె, 'కె' కు పొల్లిస్తే కే, కె క్రింద ఐత్వమిస్తే కై, 'కొ' కి పొల్లిస్తే కో యనుచూ బోధించుచున్నారు ఇది సరియగు పద్ధతికాదు. కకార ఏకారములనిగాని క కు ఏత్వమిస్తే 'కే' యనిగాని బోధించనగు ఇట్లే ఓ విషయము క కు ఒత్వమిస్తే కొ యనవలెఁగాని కె క్రింద ఐత్వమిస్తే కై యనరాదు సోదరోపాధ్యాయు లిట్టి స్వల్పదోషములఁ జక్కఁజేసుకొని బాలురను సక్రమరీతిని విద్యాసౌధము నెక్కింతురుగాక!

పైస్వరగుణితములను 'నవీన, ప్రాచీన పద్ధతులం దేది యవలంబించి బోధించిననూ నాల్గు నెలలలోపుగా పూర్తిచేయవలెను. బాలురుత్సాహపూరితులగుటకు గుణితములఁ జెప్పునప్పుడు కూడ చిన్న చిన్న మాటలను, వాక్యములను బోధించనగు. ఇదియే గుణితములకు పునర్విమర్శన (Revision) కాగలదు.

ఈదిగువ నుదాహృతములగు శ్రీజయంతి రామయ్య పంతులుగారి యాధునికాంధ్ర వాఙ్మయవికాసవైఖరి యందలి వాక్యముల దిలకింపుడు.

"గుణితమనగా—హల్లుపై నచ్చులును హల్లులును వచ్చినప్పుడు కలుగునుచ్చారణమును నిరూపించుట. వర్తమాన కాలమందక్షర గుణితము— "కకార అకారము లుక, కకార ఆకారము లుకా, కకార ఇకారములుకి, కకార ఈకారములుకీ" ఈవిధముగా చెప్పుదురు. పూర్వము "క కు (కకారమునకు) తలకట్టిస్తే క, కాకు దీర్ఘమిస్తేకా, కాకు గుడియిస్తేకి, గుళ్లోదీర్ఘమిస్తే 'కీ' యీవిధముగా చెప్పుచుండెడివారు. అనఁగా నక్షరముల కుచ్చారణమును బట్టిగాక లిపిలో వాని కేర్పడిన గుర్తుల యాకారమును బట్టి యేర్పడిన నామములే వాడుచుండెడువారు*** అచ్చులతోఁగూడని కేవల హల్లులకు ముడులని పేరు 'తాముడి' యనగాఁగేవల హల్లుటాప్రపమగు ~ ఈలాగుననే చాముడి, తాముడి-ఇత్యాదులు. ఈగుణిత క్రమముకంటె నేటిగుణిత క్రమమే యుచితముగానున్నది."

ఈవ్యాసమునందేది ప్రాచీనపద్ధతిగ సూచింపఁబడినదో అదియే శ్రీ రామయ్యపంతులు నేటి గుణితపద్ధతి యనియు అదియే యుచితముగా నున్నదనియుఁ దమ గ్రంథమున నిరూపించి యుండిరి. అనగా 'కారక' కప్రత్యయము నూతగ గాని 'కకార' అకారములుక, కకార ఆకారములుకా, యనుచూ గుణితముఁ బోధించుటే యుక్తమని పెద్దల యాశయమై యున్నట్లు శ్రీ పంతులుగారి పై వాక్యములవలన గ్రహింపనగు.

వ్యాసవిస్తర భీతిచే, ద్విత్వ, సంయుక్తాక్షరములఁగూర్చి యిందుఁబొందుపర్చలేదు.

(సశేషము)

# నిర్బంధ ప్రాథమిక విద్య.

(నూరపరాజు కోటయ్యగారు)

ప్రాథమికవిద్య జనసామాన్యమునందు విరివిగా వ్యాప్తియగుటకు, ప్రభుత్వమువారు తీవ్రముగా నాలోచించుచున్నందుల కెంతయో ప్రజలు సంతసింప తగియున్నది ఏదేశమైనను పాడిపంటలతో, ధనధాన్యములతో, శారీరక - మానసిక బలములతో, ఉన్నతస్థితిలో నుండవలయునన్న, అందుల ప్రాథమిక విద్యయె మేటిసాధనకారి. ప్రాథమికవిద్య వినా మతేదియు దేశసౌభాగ్యము కలిగింపనేరదు. విద్యావంతుడు చేసిన యేపనిగాని క్రమముగాను, లాభదాయకముగాను, రమ్యముగా నుండును. విద్యావిహీనుఁడు మామూలుగా చేయుపనిని వదలి కాలానుసరణముగ క్రొత్త దారులు త్రొక్కజాలడు. తనబుద్ధి నుపయోగించి తాను చేయుపనిలో క్రొత్తమార్పులు గావించి, ఉపాయముల వెదకి, ఆపని లాభకారిగాను సులవుగాను చేయఁజాలఁడు. లాభముగాని నష్టముగాని మామూలు పద్ధతికి మించిపోలేదు. మన దేశములోని రైతులందఱు విద్యావంతులైన యెడల, ఇప్పటికన్న అనేక రెట్లు హెచ్చు పంటలు పండించగలరు ఇందు కిప్పటి పాశ్చాత్య దేశములే ప్రబల నిదర్శనములు రమారమిగా పాశ్చాత్య దేశములన్నిటియందును ప్రాథమిక విద్య, విశేషించి కొన్ని దేశములందు కొంతవఱకు ఉన్న విద్యకూడ నిర్బంధముగా చేయబడి యున్నదని చెప్పవచ్చును. కావుననే ఆదేశములన్నియు, ఆర్థిక, రాజకీయ, పారిశ్రామిక, వాణిజ్యములం దత్యున్నతస్థాన మాక్రమించినవనుట అతిశయోక్తి కాదు. పూర్వ మొకప్పుడు లోకమున కంతటికి నాదర్శనీయముగానున్న భారతావని నేడిట్లు హీనస్థితిలో నుండుట విద్యాశూన్యతవలననే యని చాటిచెప్పవచ్చును. రాజకీయముగా నాలోచించినను పాలితులలోని విద్యావిహీనత పాలకుల పరిపాలనా సౌలభ్యమునకు తీరని నిరోధకముగా నుండును. రాష్ట్రములందలి ప్రజలు విద్యావంతులైనచో పరిపాలన సులువుగాను జయప్రదముగాను సాగిపోవుచుండును. ఓటర్లు జ్ఞానశూన్యులగుటచే ప్రజాప్రతినిధ్యసంస్థలకు సమర్థులును, స్వార్థరహితులు నగు సభ్యుల నెన్నుకొనబడకుండుటయు, తత్ఫలితముగా నాసభలయందు లేని పోని వివాదములు బయలుదేరి పరిపాలనా సౌష్ఠవమునకు విఘాతములు గలుగుటయు సంభవించుచుండును. విద్యావంతులైన పాశ్చాత్య దేశములలోని సామాన్య ప్రజలుగూడ పరిపాలనా వ్యవహారములందు నిపుణులై సౌఖ్యవంతులై యుండగలుగుచున్నారు.

భారతీయులలో ముప్పాతికవంతు వ్యవసాయముచే జీవించువారు, కొందఱు తత్సంబంధమగు కూలివారు. వీరు రానురాను హీనస్థితికి వచ్చుచుండుట అనుభవసిద్ధము. ఇందుచే వీరు తమ బిడ్డలను సైతము పొలము పనులలోను కూలి పనులలోను దింపుచున్నారు. తమ బిడ్డల కన్నవస్త్రములిచ్చి పోషించి పాఠశాలకు పంపగల శక్తి వీరికిలేదు. సాధారణముగా సామాన్య ప్రజలలో 7 సం॥ వయస్సు దాటిని బిడ్డ తన

పొట్ట బట్టలకు తానే సంపాదించుకొనుచున్నాడే గాని తల్లిదండ్రులు ప్రత్యక్షము పోషించుట లేదని చెప్పవచ్చును మన దేశములోని ప్రజలు తమ బిడ్డలను సేద్యపు పనులయందో, కూలి పనులయందో, దింపి, అందువలనవచ్చు తాత్కాలిక లాభములకు వారాశించుచున్నారేగాని, బిడ్డ విద్యావంతుడైనందున వచ్చు శాశ్వత లాభములను విచారించుటలేదు బిడ్డలు చిన్న వయస్సులోనుండి పొలము పనులకు పనికిరానంత వరకు మాత్రము కొందఱు తమబిడ్డలను బడికి పంపెదరు. వయస్సు రాగానే పొలముపనులకు పంపి వేయుదురు. కావున క్రిందితరగతులందు విద్యార్థులసంఖ్య హెచ్చుగానుండి, పైతరగతులకుపోను పోను తఱిగిపోవుచుండును. ఇందుచే ప్రభుత్వము వారు ప్రాథమికవిద్యకై వెచ్చించు ధనము నిరుపయోగముగా ఖర్చగుచుండెను. అమలులో నుంచిన నూతన నిధానము నిరుపయోగమగు ధనవ్యయము నరికట్టివేయుటకు దివ్యమగు సాధనముగా నున్నది కాని పాఠశాలకు రాని సామాన్య ప్రజల బిడ్డలను నిర్బంధముగా పాఠశాలకు రప్పించుటకు సాధనము కానేరదు నూతనవిధానములో బిడ్డల పాఠశాలకు రప్పించు భారము ఉపాధ్యాయులపై మోపబడినది కాని ఇది నెరవేరు పని కాదు. దారిద్ర్యావస్థలో మునిగి తేలుచున్న సామాన్య ప్రజల బిడ్డలను పాఠశాలకు రప్పించుటకు ప్రాథమికోపాధ్యాయుడెంతమాత్రము సమర్థుడు కాజాలడు. ఇదిగాక ప్రజల నాకర్షించునట్లు ప్రాథమికవిద్యా ప్రణాళిక సంస్కరించవలయునని కొందఱు చెప్పుదురు. కాని ఇదియు ఫలకారికానేరదు. నా అనుభవములో తల్లి దండ్రులు ఆర్థికముగా తమ కుటుంబములో వసతి లేక బిడ్డలను పాఠశాలకు పంపుటలేదేగాని విద్యావిషయమంతగా వారు పాటించుటలేదు. విద్యాప్రణాళిక నెట్లు సంస్కరించి నను వ్రాయుటచదువుట-గణితము వీనిలోమార్పు చేయుటకు గాని ప్రాథమిక పాఠశాలలలో పెద్ద పెద్ద చేతిపనులు నేర్పుటకు గాని వీలుండదు. ఇక విద్యాప్రణాళికా సంస్కరణ సమ్మోహనా యంత్రముచే ప్రజల నాకర్షించుట పొసగుటెట్లు? అసంభవమే నిర్బంధ విధానము తప్ప మతే మార్గము కానరాదు

ప్రజాసామాన్యము నందు ప్రాథమిక విద్య విరివిగా వ్యాపింపజేయుటకు నిర్బంధవిధానము తప్ప మతేయుపాయము సులువగు సాధనము కాజాలదు. మన దేశమునందు నిర్బంధవిధానములలో నుంచుట విశేషమగు వ్యయప్రయాసములకు లోనుగావలయుననుట సత్యమే. దేశౌన్నత్యమునకు మూలహేతువగు ఈకార్యమెంత వ్యయప్రయాసల కలదిరైనను వెనుదీయరాదు. ప్రభుత్వమువారు ఉన్నత విద్యకును, ప్రయాణ సౌకర్యములు, నీటి సదుపాయము, ఆరోగ్యము మొదలగు కార్యములకు ప్రస్తుతము కొంత కాలము ధనము వెచ్చించుట తగ్గించివేసి బిడ్డలకును, పెద్దలకును, ప్రాథమికవిద్య నిర్బంధముగా బోధించుటకు పూనుకొనవలెను. సామాన్యప్రజల కందుబాటులో లేని ఉన్నత విద్యకు కొంతకాలము ప్రభుత్వమువారు ధనసహాయము చేయుట పూర్తిగా మానివేసినను దేశసౌభాగ్యమునకు నష్టమురాదు. అటుగానిచో ప్రజలవద్ద విద్యాసుంకముల వసూలుచేసి నిర్బంధ విద్యకై వెచ్చించుట కూడ మంచిపనియె ఇది ప్రజలంద అంగీకరింపక పోవచ్చును. కాని నిర్బంధించియైనను ప్రజల విద్యావంతులుగ జేయుచున్న యెడల కొంతకాలమునకైనను ప్రజలిందుకు సుముఖులు గాకమానరు. ఇదిగాక నిర్ణీతమగు వరుమానము గల వారి బిడ్డల నిర్బంధముగా చదివించుటగాని, బిడ్డలను చదివించకుండా నుండవలయునన్న పోషకులు కొంత ధనము చెల్లించి లైసెన్సు

పొందవలయునని గాని, ప్రభుత్వ ఉద్యోగులు, ప్రభుత్వము వారి నుండి యేవిధమైన సహాయమును పొందువారు, పొందగోరువారు గ్రామ పంచాయతీబోర్డులు మొదలగు గ్రామ సంఘములందు సభ్యులుగానుండువారు, తమ బిడ్డలను తప్పక చదివించవలయునని గాని, శాసించుట మిక్కిలి లాభకారిగా నుండును. ఇందుచే ప్రభుత్వ వ్యయము తగ్గును, మధ్యతరగతి ప్రజలలోనైనను ప్రాథమికవిద్య పూర్తిగా వ్యాపించును. ఇక కేవలము బీదలగు ప్రజల బిడ్డల విద్యావ్యాప్తికై ప్రభుత్వమువారు కొలదిగా ధనము వెచ్చించుట సులువుగా నుండును.

ఎట్లైనను నిర్బంధవిధానము అమలు నుంచుట ప్రభుత్వమువారికి చిక్కులతో గూడిన దుస్సాధ్యమగుపనియే. కాని అదెంత దుస్సాధ్యమో దేశమున కంత లాభకారియగు పని. దేశనాయకులు విద్యావేత్తలు ప్రభువువారు ఆలోచింతురని మనవి

---

# చిత్ర ప్రశ్న.

| | | | |
|---|---|---|---|
| భ | * | * | ఒక నక్షత్రము |
| * | గ | * | ఒక గృహజంతువు |
| * | * | వ | ఒక తెలుగు సంవత్సరము |
| * | న్న | * | ఒక దేవుడు |
| తి | * | * | నూలు వడకుసాధనము |

ఇందు చుక్కలుపెట్టిన తావులలో ఇచ్చవచ్చిన అక్కరములనుజేర్చి ప్రక్కన వ్రాయబడిన యర్థమునకు సరిపోవునట్లు జవాబులు పంపగోరెదము.

షరా:— సరియైన జవాబులు పంపినవారికి పాకెట్టుసైజు భగవద్గీత సంపూర్ణగ్రంథము బహుమతిగా పంపెదము. బహుమతి పొందినవారిపేర్లు రాబోవు సంచికలో ప్రకటింపబడును జవాబులన్నియు ఈదిగువ చిరునామాకు పంపవలెను.

 మేనేజరు,
ఆంధ్రగ్రంథాలయము,
రావెల (P. O)
(గుంటూరుజిల్లా.)

---

# వింతలు - విశేషములు.

### 1. గాలిపటంలో పైకి ఎగురుట.

స్కౌటు ఉద్యమమును కనిపెట్టిన లార్డుబేడెన్ పవెలుగారి సోదరుడైన మేజరు బేడెన్ పవెలు 1894 వ సంవత్సరములో మనిషిని మోయునంత పెద్ద గాలిపటమును తయారుచేసి దానిలో పైకి ఎగిరినాడట! అట్లుగాలిపటములో కూర్చుండి పైకి ఎగురగలిగిన వారిలో మొట్టమొదట ఆయ నీతడే. ఈతడీమధ్య (77 వ యేట) లండనులో మృతినొందినాడు.

* * * *

### 2. మానవుల అవయవముల నమ్మకట.

న్యూయార్కులో సర్జనుగానున్న డాక్టరు జేమ్సు స్టాటగారు మానవుల అవయవముల నమ్మె కంపెనీని క్రొత్తగా నిర్మించినారట. ఆకంపెనీవారు, యీావరకే, తమ దేహములనుండి ఏయవయవమునైననూ ఖరీదునకు అమ్మ కోసియిచ్చుటకు సిద్ధముగా నున్నవారిని 15 గురిని తయారు చేసినారట. పాడయిన మోటార్లను బాగుచేయుటకు స్పేరు పార్టులు ఏవిధము దొరుకునో అంత సులభముగానే, పెద్దపెద్ద ఆపరేషనులు చేయవలసి వచ్చినపుడు మానవుని శరీరములోని భాగములు దొరకవలెనని యీాడాక్టరుగారి అభిప్రాయము.

* * * *

### 3. లండనునుండి ఇక్కడికి మోటారుమీాద.

ముగ్గురు యురోపియనులును, ఒక హిందువుడును, మొత్తము నలుగురు క్రొత్తగా ప్యాసయిన ఐ. సి. యస్ ఆఫీసర్లు లండనునుండి మనదేశము ఉద్యోగ స్వీకారముకొఱకు మోటారుమీాద వచ్చుచున్నారు. ఇచ్చటికి జేరుటకు సరిగా రెండునెలలు పట్టునని అంచనా వేయబడినది. నలుగురును డ్రైవింగు తెలిసినవారే. దారిలో ఉన్న అన్ని దేశములలోని ప్రజల ఆచారవ్యవహారములను, కట్టు బొట్లనుచూచు నుద్దేశ్యముతో నీవిధముగా వచ్చుచున్నారట.

* * * *

### 4. ప్రపంచములోని జనాభా

1. ఆసియాఖండము ... ... 101½ కోట్లు
   [ప్రత్యేకముగా చీనా 47½, జపాన్ 9, ఇండియా 35 కోట్లు]
2. ఆస్ట్రేలియా .. 66 లక్షలు మాత్రము
3. యూరప్ ఖండము .. 47½ కోట్లు
   [ప్రత్యేకముగా బ్రిటను 3½, ఫ్రాన్సు 4, జర్మనీ 6½, రష్యా 16¼ కోట్లు]
4. అమెరికా ఖండము ... 21½ కోట్లు
5. ఆఫ్రికాఖండము ... ... 15 కోట్లు

(ప్రపంచమంతటిలోని జనాభా 186 కోట్లు)

# శ్రీ రామకృష్ణ జీవిత సంగ్రహము.

(శ్రీయుత ట. బి వెంకటరావుగారు ట్రయినింగుస్కూలు రాజమండ్రి)

ఏ దివ్య భానోదయమున ప్రపంచమున యజ్ఞానాంధకారము విచ్ఛేదమగునో, ఏ దివ్యకుసుమ వికాసమున మాయాగంధ మదృశ్యమై సుజ్ఞాన గంధము ప్రసరించునో, అట్టిలోక కల్యాణమూర్తి యగు శ్రీ రామకృష్ణ పరమహంస దేవులు మన దేశమున పాశ్చాత్య నాగరికతా వ్యామోహ భూయిష్టమగు వంగరాష్ట్రమున కమర్పుకూరను గ్రామమున నొకశతాబ్దము క్రిందట 17 వ ఫిబ్రవరి 1836 సం॥ తేదీన నొక సద్బ్రాహ్మణ కటుంబమున జనించిరి. వీరితండ్రియగు కుదీరామచటోపాధ్యాయుడును రఘువరభక్తుడై సద్గుణసమేతుడై యుండెను. వీరితల్లియగు చంద్రామణీదేవియును బాలసాధ్వీలలామయని పేరెన్నిక గాంచెను.

దివ్యపుష్పము వికసించుచునే తన సుగంధము నెల్లెడల నెల్లు ప్రసరింపజేయునో అట్లే నీబిడ్డండును చాల జనాకర్షణీయుండై, తనపావన జన్మమును నిరూపించుటకో యన కొన్ని మహిమల జూపుటయేగాక, తన హృదయాంతర్గతమగు భక్తిజ్ఞానములగూడ చూపగడంగెను. విచిత్రముగ పురాణములయందలి కృష్ణుని వలెనే బాలుండును నొక్కసమయంబున చాలబరువుగను, నుత్తరక్షణమున చాల తేలికగను నుండువాడు. ఒకనాడు తల్లియగు చంద్రాదేవి, తన బిడ్డ నుయ్యాలలో నునిచి జోలపాడుచుండ, నాకస్మికముగా నాశిశువంతర్ధానమై యాడోలికయందు గడ్డమీసములుగల భావికాల రామకృష్ణుడు పరుండి యుండెను. అందులకు విస్మయమందుచు నామె కుదిరామాదులకు తెల్పి యాందోళన నేసెనుగాని మరల తమశిశు వందే యుండెను ఒక దినమున నీబాలవతంసము సాయంసమయమున గ్రామంటసక క్షేత్రముల గ్రుమ్మరుచుండగా నొక పెద్దయురుమున, దానితో బాటొక నల్లని మేఘమును తూర్పు దిశను లేచెను. ఆమేఘారావమునకు భయమంది కొన్ని తెల్లనికొంగ లాకసంబుపై కెగసెను మహాకవి కాళిదాసు తన "మేఘదూత" లో వచించినట్లు,

"నూనమాబద్ధ మాలాస్సే విష్యన్తేనయన
శుభగంఖే భవన్తం వలాకాః"

నల్లని మేఘముపై తెల్లనికొంగలు కన్పింపగనే, నీబాలుని యోచనాపరత విజృంభింప, నా నల్లని మేఘము శ్రీకృష్ణ స్వరూపముగను, ఆ శ్వేతపక్షుల బారు పుష్పహారముగను కన్పించుటచే, నిశ్చేష్టుడై, కన్నులనీరు స్రవించుచుండ నిలచిపోయి, శరీరము స్వాధీనము తప్పి నేల కొరిగెను. ఆహా! ఆబాలుని చిత్తస్థితి నేమని వర్ణింపనగును!

మరియొక దినమున, నీతనికెనిమిది వత్సరముల ప్రాయమున, కొందరుస్త్రీలతో గలసి, ఆ పురమున గల విశాలాక్షీదేవి దర్శనార్థమై వెళ్లెను. అచ్చట నద్దేవదేవి దర్శనముననే మరలనీ బాలచంద్రుడు బాహ్యమును మరచి, పులకాంకితదేహుడై నేలకొరిగెను. మరియును నా యూరగల మఠమునవిడిసియున్న సన్యాసుల నెల్లప్పుడు సేవించుచు వారివాత్సల్యములకు గురియై, తానుకూడ నట్లయైన బాగుండునని తలంచి, వారల నర్థించి యొక కాషాయ కౌపీనమును గొని, దాని ధరించి, దేహమంతయు భస్మమును

బూనికొని, తన వైభవమును జూప తల్లి దగ్గరకు వచ్చెను. ఆదృశ్యమును తిలకించిన నా చంద్రామణి చాలభయాకులిత స్వాంతయయ్యెను పాపము! రాబోవు విషయము లామె కెట్లు తెలియును!

మరియు, నతడు పాఠశాల విద్యల కలవడక, కొంచెము పురాణశ్రవణముమాత్రమే గావించుచుండినను, కడుమేధావిగ తన స్వగ్రామమున నందరిచే కొనియాడబడు చుండెడివాడు. ఒక దినమున కొందరు పండితులొక పెండ్లి పందిరిలో జేరి కొన్ని క్లిష్టమగు ఆధ్యాత్మిక సమస్యలను చర్చించుచుండిరి. అచ్చటికి యీ డింభకుడు గూడ బోవుట తటస్థించెను. వారి వాద ప్రతివాదముల నాతడు చెవియొగ్గివిని, రెండువేల వత్సరముల క్రితము ఏసుక్రీస్తు పండితుల సమస్యలకు జవాబు నొసంగి యుండినటుల, నతడాపండితుల సందియముల నుభయ కక్షలవారికి నచ్చునట్లు నివారణ చేసిరట! అందులకా పండితోత్తములు బాలుని ధీకుశలతకు విస్మయ మందుచు బాలుని దీవించి పంపిరి.

ఇంత చిన్నతనములోనున్నను, యీ బాలుని భూతదయాస్వభావ మతి ప్రశంసనీయము. తన తోడి విద్యార్థులలో నొక డతిబీదవాడైయుండ, నతడు వగచి, తన కళానైపుణ్యముచేత కొన్ని మట్టి విగ్రహంబుల చేసి, వానిని విక్రయించి, యా సహపాఠికి వలయు పైకమునిచ్చుచుండువాడట. ఒక్కొక్కనాడు కొందరు బాలుర వెంట గొని చేరువగల మామిడితోటకు వెళ్లి, అచ్చట వారికి భక్తిప్రబోధకముగ రాధాకృష్ణ సంవాదములను, కృష్ణలీలాదులన, వారిచే పఠింపజేయుచు, దానే స్వయముగ రాధా పాత్రమును స్వీకరించి భక్తి తన్మయత్వముతో నటించుచు నుండువాడు. ఒకవత్సరమున శివరాత్రి జాగరణకు నాయూరనొక వీధినాటకము నేర్పాటు గావించిరి. కాని అందలి శివపాత్రధారునికి జ్వరము వచ్చుటచే, నాపాత్ర నిర్వహణమునకు రామకృష్ణుడు తగినవాడని రామకృష్ణునకు శివవేషము వేయజొచ్చిరి. శంకరు బాహ్యచిహ్నముల నొక్కొక్క దానిని వేయుకొలదిని, యీ బాలుని చిత్తము, ధ్యానాధిష్ఠాన దేవుడగు నామహాదేవునిపై లగ్నమగుచుండెను. వేషము పూర్తియగు నప్పటికి మన రామకృష్ణుడు ధ్యానసమాధి నొందియుంటచే నాటకము నాపివేయవలసి వచ్చెను. చిరుతనమైనను యీ బాలునికి సత్య శీలత్వమునందు గట్టి పట్టుదల యుండెను. ఈ సత్య పరిపాలన కెట్టిది యడ్డయినను, దానిని తన్నివేయుట యందీత డీతనికే సముడు. తన శిశుత్వమునుండి తన నత్యంత ప్రీతితో జూచుచుండిన ధని యను కమ్మరవనిత యొకదినమున "నీయుపనయనకాలమున నీ ప్రథమ భిక్షను నావద్ద గైకొనుము" అని ప్రార్థింప నందుల కీబాలు డియ్యకొనెను. అట్లే యుపనయనకాలమున వాగ్దానము ననుసరించి, యెందర భ్యంతర పరచినను, కోపించినను, లక్ష్యపెట్టక, యీ బాలుడు ధని దగ్గరనే ప్రథమ భిక్ష గైకొనెను

ఇట్లుండ కొంతకాలమునకు తన నత్యంత ప్రేమతో జూచుకొనుచుండిన తండ్రి కుదీరాముడు కాలధర్మమునొందెను. దానితో పేదరికముకూడ నికుటుంబమును వరించెను. అందుచే, కలకత్తానగరమున సంస్కృత పాఠశాలనొండు సాగించుచున్న నీతని జ్యేష్ఠసోదరుడు, యీతని లౌకిక విద్యావిముఖత్వమునకు వగచి, నెట్టులైన తనసోదరునికి విద్యగఱపవలయునని రామకృష్ణుని కలకత్తాకు తీసికొనిపోయెను. కాని అనవరతము భగవచ్చింతనాపరతచిత్తులగు వారికి లైహికవిద్యలమీద బుద్ధి ప్రసరించునా! కాన రామకృష్ణు డెప్పటియట్లే యుండెను. దీనికి

సోదరుడు మందలింప "సోదరా! యీపొట్టకూటి చదువు నాకెందులకుపయోగించును? ఏవిద్యను గడించిన సర్వసంతుష్టి యెల్లకాలము కలిగి, నాహృదయమున కానందమును ప్రసాదించునో, ఆ పరావిద్యనే నేనార్జింప నిశ్చయించితిని" అని రామకృష్ణుడు నిర్భయముగ వచించెను. అందుల కాసోదరుడు దుఃఖించి చేయునది లేక యూరకుండెను.

ఈ కాలమున కలకత్తాపురవాసియగు రాణి రాస్మణియను నొక జమీందారిణి, కలకత్తాకు మూడుమైళ్ల దూరములో గల దక్షిణేశ్వరమున నొకపెద్ద కాళికాలయమును గట్టించెను. ఆ కాళికాదేవి కర్చికత్వమునకు, సోదరుడైన రామకుమారుడు సమ్మతించి దక్షిణేశ్వరమునకు రాగా నాతనితో రామకృష్ణుడును, తన భావి భాగ్యోదయమున కాటపట్టును, తన లోక కల్యాణప్రదమగు సాధనాసంతతికి రంగస్థలమును అగు దక్షిణేశ్వరమున కేతెంచెను. ఇట కేతెంచినదాది యీబాలుని దృక్పథమున గొప్పమార్పు జనించెను. ఎల్లప్పుడును నిర్జనప్రదేశమున గ్రుమ్మరుచు, ధ్యానోన్మత్తచిత్తుడై చరించుచుండువాడు. నిశీథసమయములందు దూరమునగల నిర్జనప్రదేశముల కరిగి, తీవ్రముగ సాధనాదుల నభ్యసించుచుండెడివాడు. అతని చిత్తములో నైహిక విషయము లేమాత్రమును చోరకయుండెను. అదిచూచి రామకుమారుడు సౌహార్ద్ర హృదయుడగు మధుర బాబుయొక్క ప్రోద్బలమున కాళికాలయావరణముననే గల రాధాగోవిందాలయమున నర్చకునిగా నెట్టకేల కొప్పించి, రామకృష్ణుని చేర్పించిరి. కాని రామకృష్ణుని చిత్తము మాత్రమతిదీక్షతో తన సాధనల సాగించుచునే యుండెను. ఈయర్చకుని పూజా విధానమునకును యితరులపద్ధతికిని చాల తారతమ్యము కలదు. ఆవిగ్రహములు కేవలము పాషాణములని యెంచక చైతన్యస్వరూపులని యే భావించుచు నతిభక్తితో నీబాలుడు పూజించుచుండెడివాడు. రామకుమారుడు కొన్నాళ్లకు తన సోదరుని కాళికాలయముననే యర్చకునిగా జేసిన బాగుగనుండునని తలంచి, యట్లేర్పాటు గావించెను. అదియంతయు మహామాయి యగు నాకాళియొక్క యనుగ్రహము!

ఈ కాలముననే రామకృష్ణుడు భావికాలమున ననుభవింప బోవు విషమాధ్యాత్మిక సంస్థితులయందు తోడునీడయై గురుదేవుని భౌతిక శరీరమును బోషించిన మహాశయుడగు హృదయుడు దక్షిణేశ్వరమున కేతెంచెను. అతడు రామకృష్ణు సహస్రవిధముల కనిపెట్టుకొని యుండి కాపాడుచుండువాడు. ఈకాలముననే రామకృష్ణుని సోదరుడగు రామకుమారుడు దివంగతుడయ్యెను. ఈమృతి రామకృష్ణునికి ప్రపంచముయొక్క అనిత్యత్వమును బాగుగాబోధించి, యాతని దివ్యతరాధ్యాత్మికా వేదనలకు గొంపోయెను. తనబోటి యువకులందరును విషయ వాంఛామగ్నులై చరించుచుండ, నీయువకుడు అసమాన విరహవేదనా భారమున మ్రగ్గుచుండెను. కాళికాలయమున చేరిననాటనుండి కాళికాదేవి యీతని యిష్టదైవతమయ్యెను. అనుదినమును ఆకాళికా విగ్రహమునకు పుష్పగంధముల నలంకరించు నప్పుడా దేవి యీతనికి చైతన్యస్వరూపిణిగనే గోచరింపజొచ్చెను. పూజాదులైన పిమ్మట యథాప్రకార మాత డేకాంతముల కరిగి రాత్రులందు కన్నులు దుఃఖభరమున వాచునంతవరకు విలపించి తెల్లవారునప్పటికి దేవాలయమును జేరుచుండువాడు. ఇట్లు కొంతకాలమైన పిమ్మట యీతని ధ్యానతత్పరత యెక్కువయై నిశీథులందు, తన యగ్రజన్మము వలన గల్గు యహంకారమునుగూడ త్యజింప జందెమునుదీసి దిగంబరియై పంచవటిక్రింద తీవ్రతపం బొనరింపగడంగెను. ఈయగ్రజన్మవాసన సంపూర్ణముగ యడుగంటుటకై యొకపంచముని మరుగుదొడ్డిని

తానెవ్వరికిని దెలియకుండ నర్ధరాత్రమున తన దీర్ఘకేశములతో నూడ్చి కడిగి శుభ్రపరచెను. ఈకాలమున మహామాయాదర్శన ప్రాప్తియె గురుదేవుని దృక్పథమున నిలచెను. రామప్రసాద కమల కాంతాది భాగవతోత్తముల కీర్తనల నీయన భక్త్యావేశమున పాడుచుండెడివాడు. తల్లి నుండి యెడబాటు గలిగిన బిడ్డభంగి "అమ్మా! నీవెచ్చటనుంటివి ? నాకు ప్రత్యక్షమగుము. నాకైహిక భోగములవసరములేదు. నేను నిన్ను కన్నులార చూడవలెను" అనుచు నేడ్చుచుండెడి వాడు. ప్రొద్దు క్రుంగగనే దేవాలయములోని ఘంటారావమునువిని "ఓమాతా! నీదర్శనము లేకయే మరొక దినము వ్యర్థమయ్యెగదా!" అని మరింత గొల్లున నేడ్చుచుండెడివాడు. ముఖమునా వేదనా భారమున నేలకు మోదుకొనుచుండెడి వాడు. ఈయేడ్పులనాలకించి, చుట్టు ప్రక్కల నుండువారు నిజముగ నీయువకుడు తనతల్లిని గోల్పోయెనుకాబోలునని తలంచి కన్నీరు గార్చెడివారు. మరియొక వేళ కాళీసన్నిధానమున కూర్చుండ "నీవు నైజమా లేక నాచిత్తభ్రమయా లేకున్న నాకెందులకు కానుపింపవు?" అనుచు, "ఆహా! నిన్నుగాంచని యీజన్మవ్యర్థము. ఈ రీతినే దర్శనభాగ్యములేక నాదినము లొక్కటొక్కటె వ్యయమైననేమి ప్రయోజనము!" అనుచు నేలదొరలి యేడ్చెడివాడు. అట్టిబాధ ననుభవించువానికి నిద్రాహారాదులిముడునా ? స్పృహతప్పి పడియుండ నొక్కొక్కనాడు హృదయుడు, గురుదేవుని నోటిలో క్షీరముపోసెడి వాడు. అవియైన నొక్కొక వేళ మ్రింగు పడెడివి కావు! ఈకాలమున దేహమునంతయు చిన్ని పురుగులు క్రమ్మికట్టుచున్నను వారికేమాత్రమును తెలియక పౌరాణిక వాల్మీకిని స్మరణకు దెచ్చెడివాడు. ఒక్కొక్కనాడు కామ కాంచనా వాంఛల బారినుండి విడివడ, మట్టిని రూపాయిని రెండు చేతులలో నిడికొని, విమర్శించి, వాని యేకత్వమును దర్శించినవాడై రెంటి సమత్వమును బ్రకటించెను.

మ॥ కనకంబొండు కరంబునందునిడి వే
డ్కన్ మంటి వేరొక్కటన్
గొనిశ్రేష్ఠంబగు యోచనా పరత సాం
గోపాంగ విజ్ఞాన వా
హినులచేమున్గి సమత్వదృష్టిగని స
ర్వైకార్థమున్ గాంచి వా
నిని వైరాగ్యముతో త్యజించెదవు
శ్రీరామకృష్ణ ప్రభూ!

ఈచిత్తవృత్తి ననుసరించి గురుదేవుడు కాళిని పూజించు పద్ధతియు చాల మారెను. పూజా సమయమున కాళికర్పింపబోవు పుష్పముల తన శిరమున దాల్చును. నిశ్చేష్టుడై కాలపరిమితిని మరచి యటులే గర్భాలయమున పూజను నిలిపి కూర్చుండి యుండును. లోకమాతకు నైవేద్యము నిడుచు తినుచున్న దేమో యని యామె ముఖమువంక నట్లే చూచుచుండును. ఆహారము చాలతక్కువయై, నిద్రలేకుండి, భక్త్యావేశము చాల మిక్కుటమగుటచే, నాయువకుని ముఖము, వక్షము, నెర్రవై యుండెడివి. కన్నులవెంట నెల్లప్పుడు అశ్రువులు రాలుచునే యుండెడివి. పాపమెంతకాల మిట్లు కాలముగడపుట! నిరాశా వాయువులు హృదయమున వీవదొడంగెను. అట్టినిరాశావేశమున నొకదినమున దేవ సన్నిధానమునకరిగి, "అమ్మా! నా దీనాలాపముల నెందుల కాకర్ణింపవు? ఇంతకాలము నిన్ను ప్రార్థించితినే! ఇంకనాజీవితము వ్యర్థము." అనుచు దేవిహస్తమునగల కరవాలమును గైకొని తనశిరమును ఖండించుకొన బూనెను. కాని వెంటనే యాతడు మైమరచి నేలకొరగెను. ఆమహామాయి, పుత్రుని దీనదశకు వగచి, భక్తి తన్మయత్వమునకు సంతసించి వెంటనే ప్రత్యక్షమై తన పుత్రుని యానందవాహినుల ముంచి తేల్చెను. పిమ్మట గురుదేవుడు ఆదేవీదర్శన

మహారతము గలుగ ప్రార్థింపజొచ్చెను. కొంత కాలమునకు ఆకరుణామయి వీరియందనుగ్రహ ముంచి కోరినప్పుడెల్ల తన అసమాన వైభవములతో ప్రత్యక్షమగుచు, ప్రశంసించుచు, లాలించుచుండెను. ఆహా! వీరి భాగ్యమేమని వచింపనగును!

మ. జడమా రాతిని గొల్చుచున్, బరమపూ
జా యోగ్యమా కాళి న
ప్పుడు దర్శించితివీవు, పల్కితివి స
మ్మోదంబుగా వాణితో,
నడువన్ గల్గితి వాదుయానలకులో
నైనీవు, మోక్షంబనన్
విడిగా వేరొకటుండునే గురుతపస్వీ
రామకృష్ణ ప్రభూ!.

అటుపిమ్మట రామకృష్ణుని సాధనావిధానము నందును, చిత్తవృత్తి యందును మార్పు జనించెను. శాంతదాస్య సత్యవాత్సల్య మనుర మార్గముల జరించి ఆధ్యాత్మికానుభవముల నొంద గురుదేవుడు నిశ్చయించెను. దాస్య భావమున సాధనజేయ హనుమంతుని యాదర్శకముగ నుంచుకొని యత్నింపగా, కోతివలె చెట్లనెక్కుటయే గాక, వీరికి కొంచెము తోక కూడ పెరిగినది! అప్పుడే సీతారాము లనేక పర్యాయములు వీరికి దర్శనంబిచ్చిరి.

తన యనుంగు తనయుడిట్లు అనవరత ధ్యాన సమాధుల నిమగ్నుడై పిచ్చివానివోలె గుమ్మరుచు దేవాలయార్చకత్వము గూడ చేయలేని స్థితియందుండుట జూచి చంద్రామణి దేవి చాలదుఃఖించి, రామకృష్ణునికి వివాహము చేసిన యాపిచ్చి కుదురునని తలంచి, జైరాం బాదులో గల రామచంద్రముఖోపాధ్యాయుని కుమార్తెయగు శారదాదేవిని యిచ్చి పరిణయము చేసిరి. తనయాధ్యాత్మిక సాధనల కడ్డురాదనియు, మీదుమిక్కిలి తనకు సహాయము చేయుటయేగాక తానే యాధ్యాత్మికానుభవ సంపాదనయందు నుత్తమస్థితి నొందగలదనియు దెలిసిన మన రామకృష్ణుడు శారదాదేవిని వివాహమాడుటకు నిరాకరింపలేదు. అందుచేతనే నీ శారదామణీదేవి తనజీవితేశుని చిత్తస్థితుల గ్రహించినదై తన సర్వస్వము గురుదేవుని పాదపద్మముల నర్పించి, రామకృష్ణుని గురుభావమున జూడగడంగెను. రామకృష్ణుడద్దానికి సంతసించి, శారదాదేవికి ప్రాపంచిక వ్యవహారములయందేగాక, ఆధ్యాత్మిక విషయములమీద చాల ప్రబోధము చేసెరి. సర్వమును భగవదర్పిత మొనర్చి చరించునట్లు ఆమెను దయారుచేసిరి. ఆమెయు అట్టి గురుదేవుడు తనకు లభ్యపడెనుగదా యని యుత్సాహమున సాధనల గురుదేవుని యాదేశానుసారము సల్పుచు ధన్యయయ్యె. అందుచేత నామె యాదర్శక హిందూవనితామణియై లోక ప్రఖ్యాతిగాంచి, సహస్రసంఖ్యాకులగు రామకృష్ణుని శిష్యులకు సాధనాంశముల బోధించుచు అనేకస్త్రీలకు గురువై తనరారినది. ఈ స్త్రీకులాభూషణము నేడు మాతృదేవి యను నామమున ప్రఖ్యాతి గాంచెను.

అంత కాలగతమున రామకృష్ణుని హృదయము విశ్వరూపమును దాల్చుచు ప్రపంచమున గల సర్వమతముల సారమును గ్రోలవలయునని వారికి తెలియకయె యొక శక్తి బయలుదేరెను. అప్పుడే తంత్రమార్గముల నత్యంత ప్రవీణయై అనుభవజ్ఞానియగు యోగీశ్వరీదేవి బ్రాహ్మణి భైరవి యను యోగిని రామకృష్ణుని కొరకు వెదకికొనుచు దక్షిణేశ్వరమునకు వచ్చెను. తగు మాతృవాత్సల్యమున నామె రామకృష్ణుని ప్రేమించి, చాల కాలము దక్షిణేశ్వరమున నుండి యిరువది నాలుగు తంత్రమార్గముల గురుదేవునిచే నభ్యసింపజేయుటయే గాక, పండిత

సభల నాహ్వానించి, రామకృష్ణు డవతారస్వరూపుడని ప్రకటింప జొచ్చెను. ఇట్లుండగా జటధారి యగు నొక యోగి దక్షిణేశ్వరమున కేతెంచెను. ఆతడు శ్రీరామచంద్రుని వాత్సల్యభావమున బ్రేమించువాడు. రామకృష్ణు డద్దాని నాతనినుండి గ్రహించి, ఆవిధానము నభ్యసింప యనతికాలములో శ్రీరామచంద్రుడు చిన్న బాలుని రూపమున వచ్చి యాడుకొనుచుండెడివాడు. మధురభావమున తన్మయత్వము నొందుచు, రాధవలె నభినయించుచున్నట్లే వస్త్రంబుల ధరించుచు నుండ కొంతకాలమునకు రామకృష్ణునికి స్త్రీ స్వభావమే యేర్పడి చూపరులకు స్త్రీయా యని సంశయము గొల్పించుచుండెడిదట. ఆరాధామాయివలె తీవ్రభావముల ననుభవించుచు, శ్రీకృష్ణుని గూర్చి కరతలామలకముగా రామకృష్ణుడు తెలిసికొనెను.

శా. 'రామా' యన్న నిమేషమే చిరుతవై।
'రాంలాల' నాచుంబునన్
నీముందాటలనాడు, కృష్ణుడగుచున్।
నీమోహల సాక్షాత్కరిం
చేమేమో సరసోక్తులాడుగద "శ్రీ।
కృష్ణా" యనన్, దేవదే
వా! మీభాగ్య విశేష మెక్కడిది వ।
హ్వా! రామకృష్ణ ప్రభూ!

ఇది ముగిసిన వెంటనే నాగసాంప్రదాయక మఠమున కధిపతియును, కేవలము వైరాగ్య స్వరూపుడును అగు తోటపూరియను జ్ఞానసంపన్నుడు దక్షిణేశ్వరమునకు వచ్చెను. ఈతడు చిన్నతనముననే ప్రపంచ వ్యామోహముల ద్యజించి, సన్యాసియై నలుబది వత్సరములు యుగ్రతపంబొనర్చి నిర్వికల్పసిద్ధి నొందిన మహాయోగిపుంగవుడు. ఈతడును రామకృష్ణుని ముఖవర్చస్సును దిలకించి, రామకృష్ణున కద్వైతము బోధింప బూనుకొనెను. అట్లే నొక్కదివసంబున యుపదేశాదులయి రామకృష్ణునికి సన్యాసము నిప్పించి నిరాకారనిర్గుణ బ్రహ్మమును ధ్యానించు విధానము దెల్పి, ధ్యానింప రామకృష్ణు నియోగించెను, కానిమన రామకృష్ణుడుఅపూర్వశక్తితో వరుసగా మూడు దివారాత్రములు నిర్వికల్పము ననుభవించు చుండుట చూచి యాశ్చర్యము నొంది తోటపూరి బలవంతముగా రామకృష్ణుని చిత్తమును సమాధినుండి ప్రపంచ గోష్ఠికి లాగవలసి వచ్చెను. దీనితో రామకృష్ణుడు హిందూ మతమునగల సర్వవిధ మార్గము లనుసరించివాని గమ్యస్థానముల ననుభవ వేద్యము జేసికొని తృప్తిగాంచెను.

కాని యంతటిలో నూరుకొనక, వీరిదృష్టి అన్యమతములపైకి గూడ బ్రసరించెను. ప్రథమమున ఇస్లాముమతము వీరి కంటబడెను. వీరి కాయిచ్ఛ గలిగిన వెంటనే యొక మహమ్మదీయుడరుదెంచి నిత్యమును ఇస్లాము మత సిద్ధాంతముల రామకృష్ణునికి బోధింపజొచ్చిరి. అప్పుడు వీరు మహమ్మదీయ దుస్తుల ధరించి, నమాజు సక్రమముగా జేయుచుండుటయే గాక, హిందూ సాంప్రదాయమునే దూషించు చుండెడివారు. ఇట్లు మూడుదినములైన పిమ్మట ఆమతసిద్ధిని గాంచిరి

అంతక్రైస్తవ మతము నవలంబింప నిచ్ఛ జనింప నొక క్రైస్తవుడు వారికిబైబిలును చదివి వివరింప గడంగెను. అప్పుడే ఏసు యొక్కయు, మేరీయొక్కయు విగ్రహములు చేతనత్వమునొంది వారిలోనొక పెద్దమార్పును గలుగజేసిరి. ఈ కాలమున నొక పర్యాయము క్రైస్తవ చర్చికి కూడ నరిగిరి. అప్పుడు క్రైస్తవ భావములుగాక తదన్యంబులు వారిని చేరెడివికావు. ఇట్లు మూడు దినములు గడచిన పిమ్మట ఏసుక్రీస్తు వీరికిప్రత్యక్షమై వీరియం దైక్యమొందెను.

శా. మూడేరోజులలోన బుద్ధునటులే
నూనాళ్ళలో క్రీస్తు, నా
మూడేరాత్రుల మహమ్మదు మహా
త్మున్, నిర్వికల్పంబునా
మూడేనాడుల నెవ్వడైన గనెనే!
పూర్వంబు దర్శించునే
నేడైనన్ గనగల్గు నొక్కయికనే
నిన్! రామకృష్ణ ప్రభూ!

ఈవిధముగా సర్వమతముల ననుసరించి గమ్య స్థానము నొందిన మహాశయుడు, లోకైకమూర్తి యీ రామకృష్ణ పరమహంస దేవుడు.

శా. నీచారిత్రము, నీమహత్వ ఘురులున్
నీమార్గముల్, చేతలున్,
నీచైతన్యము, నీమభక్తి రతయున్,
నీరూపు నీసిద్ధులున్
నీచాయల్, దయయున్, తపంబు,మహిమల్
నీవాక్యముల్ విన్న, శౌ
రీ! చేమోడ్చనివాడు మానవుడొకో
శ్రీరామకృష్ణ ప్రభూ!

ఈరామకృష్ణ కుసుమము వికసింపగనే ఆ కుసుమ గర్భిత మధు సంసేవనార్థమై యనేక మధుప సముదాయములు రాజొచ్చెను. ఆంగ్ల విద్యా పారంగతులైన పండితులును, ఉన్నతోద్యోగీయులును, విద్యార్థులును, స్త్రీలు పురుషులును వీరి నాశ్రయింపజొచ్చిరి. అందు ముఖ్యముగా బ్రహ్మ సమాజ నాయకుడగు కేశవ చంద్రుడొక్కడు ప్రఖ్యాతుడు ఈ సంగమము వలన కేశవచంద్రుని దృక్పథమే మారిపోయెను. అనేక యువకులు వీరిని గురువుగా భావించి యుపదేశామృతమును గ్రోలి ధన్యులైరి ఇట్లు ముముక్షులోకమునకుగురుస్థానము నలంకరించిన మహాపురుషు డీతడు!

మ. అవలంబించిరొ కొక్కమార్గమును గ
మ్యస్థానమున్ జేర యో
గివరున్, సద్గురువర్యులైన పలుశ
క్తిల్ నీవలెన్ సర్వమా
ర్గవితానాంతములంది, సర్వమత సా
ర్వత్రిక సందేశసా
రవిశేషంబుల దెల్పగల్గిరె! సుధి
రా! రామ కృష్ణప్రభూ!

సర్వమతముల ననుభవించి, సర్వమతసౌభ్రాతృత్వమును నెలకొల్పిన లోకైక గురువు, సర్వ ప్రపంచమునకు భక్తి భిక్షనిడిన మహాత్ముడు, 16-8-1886న తన భౌతిక దేహమును పరిత్యజించి మహాసమాధి నొందిరి.

శా. నీకార్యంబులు చిత్రముల్ పరమసం
దేహాస్పదంబుల్, మహో
ద్రేకస్వప్నములున్, భయావహములున్
దివ్య ప్రభాన్వితముల్
లోకాతీతము లద్వితీయములు, త్రై
లోక్య ప్రసిద్ధంబులున్
శ్రీకల్యాణ గుణప్రబోధకములౌ
శ్రీరామకృష్ణప్రభూ!

కాని అట్టివాని యనుభవపరంపరలు, అట్టివాని జ్ఞానదీప్తుల దృశ్యములగునా! ఎన్నిటికిని కానేరవు. అవి సర్వ ప్రపంచమును ఆవరించి అనంత సంఖ్యాకుల ప్రతీతుల జేయవలెగదా!

అట్లే గురుదేవుని మరణానంతరము గురుదేవు నాశ్రయించిన శిష్యబృందములో నసమాన ధీశాలియగు నరేంద్రుడు సన్యసించి, వివేకానంద స్వామియై, హిందూదేశ మంతయు పర్యటన మొనర్చి తీవ్రసాధనచే జ్ఞానార్జన మొనర్చెను. అటుపై అమెరికాదేశమున చికాగో నగరమున క్రైస్తవ మత ప్రాపకము నకై క్రైస్తవుల చే 1893 సంవత్సరమున సమకూర్పబడిన సర్వమత సమ్మేళనమునకు అనేక కష్టముల కోర్చి, జని, ప్రాక్పశ్చిమ దేశీయ పం

డితవర్గముచే నిండియున్న యా సభా వేదికపై హిందూమతమును గూర్చి యసాధారణ ప్రజ్ఞతో అనిర్వచనీయ వాగ్ధారతో, గంభీరోపన్యాసముల నొసంగి,

మ. తన గంభీర వచఃప్రవాహముల త
త్త్వార్థంబు పొంగార, భీతిని
యాకాశము తల్లడిల్లు కరణిన్
దేదీప్యమాన ప్రభన్
ఘనుడై ప్రజ్వలింప జేసెడు వివే
కానంద యోగిన్ సమస్త
నరేంద్ర ప్రియుగొల్చి మ్రొక్కెద సురేశా!
రామకృష్ణప్రభూ!

అమెరికాదేశీయుల ప్రశంసలకు పాత్రుడై, నాల్గు వత్సరము లేక ధారగా ఉపన్యాసముల అమెరికా, ఐరోపాఖండముల వేదాంత గర్జార్భలు మ్రోగించి, జగత్ప్రఖ్యాత మహాపురుషుడై స్వదేశమును 1897 వ సంవత్సరమున జేరెను. పాశ్చాత్య దేశములు వేదాంత సందేశమునకై యెట్లు నిరీక్షించుచున్నారో గ్రహించినవాడై, వేదాంత ప్రచారము సర్వప్రపంచమున జేయునుద్దేశముతో, ప్రాశ్చ సమ్మేళనాభిలాషియై కలకత్తా నగరమున శ్రీ రామకృష్ణమిషను అను కేంద్ర స్థానమును నెలకొల్పెను. ఆసంస్థకు ప్రథమమున తన గురుదేవుని దగ్గర నెక్కువ ప్రేమ చూరగొనుచుండియుండిన బ్రహ్మానందస్వామిని అధ్యక్షునిగ జేసి శ్రీ అభేదానంద శారదానంద, తురీయానంద మొదలగు వారిని పాశ్చాత్యదేశములకును, శ్రీరామకృష్ణానందస్వామిని మద్రాసునకును, శ్రీ శివానందస్వామిని సింహళద్వీపమునకును పంపి ప్రచారము నర్ప జేసెను. తర్వాత నీ సంస్థలు నిరుపమానమై యభివృద్ధిగాంచి, స్థాపించిన నలుబది వత్సరములలో ప్రపంచమునంతయు బ్రాకి, వేదాంత ప్రబోధ సేయుచు, రామకృష్ణానుభవ విభూతుల ప్రకటించుచు, సర్వమత సౌభ్రాతృత్వమును చాటుచున్నవి. ఈ సంస్థయొక్క యాజమాన్యమున, ప్రపంచమంతటను శ్రీరామకృష్ణ మఠములు, ఆశ్రమములు సుస్థాపితములై మత ప్రబోధమును, వేదాంత సాధనములను, మానవ సేవయును కృషిచేయుచున్నవి అందుచే దేశమున నెక్కడేని తుపాను, క్షామము, భూకంపము, అంటువ్యాధులు మొదలగు ప్రకృతి వైపరీత్యములు సంప్రాప్తమైనపుడు, ఈ రామకృష్ణ మిషనుకు సంబంధించిన సన్యాసులు ప్రజలకు జేయుచున్న సేవ మిగుల ప్రశంసార్హమును, అనుకరణీయము. ఇంకను ఈ మిషనువారు విద్యాలయములను, పరిశ్రమాలయములను, వైద్యశాలలను నడుపుచు, ప్రజోపయోగార్థము అనేక మత ప్రబోధక గ్రంథరాజములను, వార్తాపత్రికలను, ప్రకటించుచు, ప్రపంచ ప్రఖ్యాతి గాంచుట బాల యానందదాయకము గదా! భగవంతుడింకను వీరియాశయముల సాఫల్యపరచుచు చేయూత నొసంగుగాత!

# విద్యావిషయిక వార్తలు

## మధ్యపరగణాలు.

మధ్యపరగణాల (C P) గవర్నమెంటువారు (కాంగ్రెసు మంత్రిత్వములోనిది) నవీన పద్ధతులలో నిర్బంధ వ్యాయామవిద్యను ప్రతి హైస్కూలులోనూ యిచ్చుటకు ఉత్తరువులు జారీ చేయించినారు.

*　　*　　*　　*　　*

## తిరువాన్కూరు.

తిరువాన్కూరు సంస్థాన రాష్ట్రములో యిదివరకే పాఠశాలల నన్నిటిని ఉదయం 7 గంటల లగాయతు 11 గంటల వరకనూ జరుపవలసినదిగా విధించియున్నారు. అక్టోబరు 18 లగాయతు అన్ని ఆఫీసులను గూడ 7 మొదలు 12-30 వరకు పనిచేయువలసినదిగా శాసించియున్నారు.

*　　*　　*　　*　　*

## ఇటలీ.

1941 వ సంవత్సరాంతమునకు యితరదేశముల మీద నేవిధమైన వస్తువులకొఱకును ఆధారపడకుండా స్వతంత్ర జీవనము తనదేశము చేయదలచి రాజ్యాంగ విధానములోనూ, విద్యా విధానములోనూ తగుప్రయత్నములు చేయుచున్నదని ఇటలీ డిక్టేటరైన ముస్సోలినీ ప్రకటించినాడు.

## గ్రామోద్ధరణ.

విద్యాశాఖామంత్రిగారి పార్లమెంటరీ శెక్రటరీ అయిన శ్రీయుత (C J) వార్కీగారు గ్రామోద్ధరణను గురించి మద్రాసులో ఉపన్యసించుచు అది 5 మార్గములుగా నుండవలెనని సూచించియున్నారు.—

1 ఋణదాతల బారినుండి రయితులను తప్పించి, వారి సహాయము కొఱకు కోఆపరేటివ్ సొసైటీలను, ల్యాండు మార్గేజి బ్యాంకులనూ నిర్మించుట.

2. నూలు వడకుట, బట్టలు నేయుట మాత్రమేకాక పండ్లతోటల పెంచుట, పలు వెన్న పరిశ్రమ మొదలైన లాభకరములగు యితర పరిశ్రమలను ప్రతియూరను కల్పించుట.

3. ప్రయిమరీ వరకునూ నేర్చుకొన్న విద్య మరువకుండా జేయుటకు లైబ్రరీలను, నాటక సమాజములను, రాత్రిపాఠశాలలను నిర్మించి వయోజన విద్యను ప్రతియూరను విరివిగా నిచ్చుట.

4. ఆరోగ్య సూత్రములను ప్రత్యేకముగా గ్రామవాసులకు బోధించి సాధ్యమైనంత వరకు, ప్రతిగ్రామమునను ఒక్కటియైన ఆసుపత్రిని నిర్మించుట.

5. పంటలను యితరగ్రామములకు సుళువుగ దీసికొని పోవుటకు సరియైన వీథులను కలుగ జేయుట.

*　　*　　*　　*　　*

## బొంబాయి.

బొంబాయి మ్యునిసిపల్ కార్పొరేషనువారు, వారికి చెందిన ప్రయిమరీస్కూళ్లలో చదువు వారిలో కృశించియున్న బాలబాలికలకు ఉచితముగ శుభ్రమైన ఆవుపాలను సప్లైచేయుటకై 2 లక్షల రూపాయలను గ్రాంటు చేసినారు.

# స్కౌటు సంగతులు.

మదాౖసు స్కౌటు కౌన్సిలువారు కోరినప్రకారము 1 వ అక్టోబరుకు అఖిల భారత స్కౌటు సంఘము ఇంపీరియల్ స్కౌటు సంఘముతో సంబంధమును వదలుకొనని కారణమున మదాౖసు రాజధానిలోని స్కౌటుశాఖ, అఖిల భారత స్కౌటుశాఖ నుండి వేరై పోయినది.

వేరుచేయబడిన మదాౖసు స్కౌటు శాఖకు ప్రత్యేక నిబంధనలు తయారైనవి ఇంకను స్కౌటు కౌన్సిలులో ఆమోదింపబడలేదు కాని సబ్ కమిటీ వారు సూచించినమార్పులు కొన్ని గ్రిందు వ్రాయుచున్నాము.

1. ఎర్రని ఫ్లోర్డిలీకి మధ్య తెల్లని తామరపువ్వు మదాౖసు శాఖకు గుర్తు.
2. వెనుక ఉండిన దుస్తులే ఇప్పుడు కూడ ఉండును గాని, స్కౌటు ఆఫీసర్లను, రోవర్లను వారి కిష్టమైనయెడల నిక్కరుకు బదులుగ పైజామాను, పొట్టిచేతుల షర్టుకు బదులుగ లాల్చిని ధరించవచ్చును.
3. ఆకుపచ్చని ఖద్దరు గుడ్డమీదగాని, పూలుగుడ్డమీదగాని, పైన చెప్పిన ఫ్లోర్డిలీని కలిగియున్న స్కౌటుజండానే ప్రతిస్కౌటు సమావేశములందును ఎగురవేయవలెను.
4. స్కౌటుప్రమాణము – వెనుకవున్నదికాక, To keep myself physically strong, mentally awake and morally straight
5. స్కౌటు లా.—A Scout is (1) trustworthy (2) loyal (3) helpful (4) friendly (5) courteous (6) kind (7) obedient (8) cheerful (9) thrifty (10) brave (11) clean (12) reverent
6 దేశభక్తిని స్కౌట్లలో పెంపొందించుట.
7. జిల్లా స్కౌటుసంఘములను తీసివేసి, లోకల్ స్కౌటుసంఘములను నెలకొల్పుట.

స్కౌట్లకు టెండరుఫుట్ కోర్సులో (1) చట్టము (2) స్కౌటు జండా నిర్మాణము, (3) 8 ముడులును, (4) తలపాగాచక్కగానతొందరగాను చుట్టుట (5) కర్రయొక్క ఉపయోగములు (6) 3 జాతీయగీతములు (7) 10 దండెములు, 20 బస్కీలు (8) జాడల దీయుట. సెకండుక్లాసు కోర్సులో (1) ప్రథమ చికిత్స (2) సాంకేతికము (3) జ్ఞానేంద్రియములతో సంబంధమైన ఆటలు (4) స్కౌటునడక (5) రెండు అగ్గిపుల్లలతో అరుబయట మంటనుచేసి, పోషించి, ఆర్పుట (6) వండుట (7) 16 దిక్కులు (8) 2 రాత్రులైనను క్యాంపు (9) 8 యోగఆసనములు లేదా స్కౌటు సాధనములు (10) 8 అణాలను సంపాదించుట (11) యూనిఫారంను ఉతుకకొనుట, రిపేరీలు చేయుట, జాగ్రత్త పెట్టుకొనుట (12) ఒక దేశీయనాయకుని పూర్తి జీవితచరిత్ర ఫస్టుక్లాసు కోర్సులో (1) ఈత (2) 1 రూ॥ సంపాదన (3) పూర్తి సాంకేతికములు ఒంటరి ప్రయాణము (5) పూర్తి ప్రథమచికిత్స (6) పిండివంటలతోసహా వండుట. (7) మ్యాపులు గీయుట (8) గొడ్డలి నుపయోగించుట లేదా నేత లేదా వడ్రంగము (9) అంచనా పద్ధతి (10) మొక్కలు, పసరులు, జంతువులు, పిట్టలు, నక్షత్రజ్ఞానము (11) టెండరుఫుట్ ను తయారుచేయుటకు జిల్లాలోని చరిత్రాత్మకమైనట్టియు, రమ్యమైనట్టియు ప్రదేశము లు(13) కసరతు చేయుట (14) పొగాకు, త్రాగుడు వలన నష్టములు వీటినిగురించి నేర్పెదరు

# సభలు.

విద్యావారము.

అక్టోబరు ఆఖరు వారములో మన మదాసు రాజధానియందలి పెక్కు విద్యా సంస్థలచే విద్యావారము చాలా జయప్రదముగ జరుపబడినది.

ఈ సందర్భమున ఏలూరు మ్యునిసిపల్ హైస్కూలులో ప్రత్యేకముగ ఉపాధ్యాయుల కొక సభయు, విద్యార్థులకు వేరొకసభయు జరిగినవి. ఉపాధ్యాయుల సభకు ట్రయినింగుస్కూలు ప్రధానోపాధ్యాయులైన శ్రీయుత పీటర్సుగారు అధ్యక్షులుగ నుండిరి. శ్రీమత్త్రిపాఠి భయంకర కృష్ణమాచార్యులుగారు "పూర్వపువిద్య"నుగురించియు, శ్రీయుత ఉపాధ్యాయుల సత్యనారాయణగారు "ఉపాధ్యాయ సంఘముల యావశ్యకతను" గూర్చియు, శ్రీయుత ఆచంట సుబ్బారాయుడుగారు "ఆదర్శనీయమైన ఉపాధ్యాయు డెట్లుండవలెను?" అను విషయమును, శ్రీయుత జోశ్యుల వెంకట్రావు గారు, "రాబోవుమార్పులను బట్టి ఉపాధ్యాయుడెట్లు మారవలసి యున్నది." అను విషయమును గూర్చియు ఉపన్యసించి యున్నారు.

విద్యార్థుల సభకు మన మదాసు అసెంబ్లీమెంబరుగా నున్నట్టియు, ఎడ్యుకేషన్ సబ్ కమిటీలో మెంబరుగా నున్నట్టియు, శ్రీమతి గంధం అమ్మన్న రాజాగారు అధ్యక్షత వహించిరి. శ్రీయుత పి నరసింహంగారు "ప్రస్తుత విద్యావిధానమును" గూర్చియు, శ్రీయుత చిమటపు సూర్యనారాయణరావుగారు "స్కూలు డిసిప్లిన్"ను గూర్చియు, శ్రీయుత సోమంచి లింగయ్యగారు "విద్యా విధానము, అప్పుడు, యిప్పుడు, ఇకముందు" అను విషయమును గూర్చియు ఉపన్యసించిరి.

హిందీవారము.—విద్యా వారమప్పుడే హిందీవారము కూడ మన దక్షిణ హిందూస్థానములో చాలచోట్ల నత్యుత్సాహముతో జరిపియున్నారు.

ఈ సందర్భమున ఏలూరు హైస్కూలు నందు అక్టోబరు 30 వ తారీఖున ఉదయం 8 గంటలకు శ్రీయుత తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రిగారు ఆంధ్రభాషలో హిందీని గురించి 2 గంటలసేపు మాట్లాడి యున్నారు. తాము నేర్చిన 7, 8 భాషలలో హిందీయంత చక్కనిది తమ కగుపడలేదని నుడివియున్నారు. 1, 2, 3 ఫారంలలో హిందీని నిర్బంధముగా నేర్పుట చాల మంచిదనియు, మాతృభాషల కెంతమాత్రమును చెరుపు కలుగదనియు, లిపినిగురించి పట్టింపులు పోనక్కర లేదనియు వారు తెలిపియున్నారు.

స్కౌటు రోజు.

మదాసు రాజధానియందలి క్రొత్త స్కౌటుశాఖకు ఛీఫ్ కమీషనరైన జస్టిసు వెంకట సుబ్బారావుగారు 6 వ నవంబరున రాష్ట్రమంతటిలోనూ స్కౌటురోజుగా పరిగణించి ఉత్సవములు చేయవలసినదిగా కోరిన మీదట ఆవిధముగా అన్నిజిల్లాలలోనూ స్కౌటురోజు జరుపబడినవి.

పశ్చిమ గోదావరిజిల్లాలోని చాలా ట్రూపులు స్కౌటురోజును జయప్రదముగ జరిపినారు. శ్రీయుత పోపూరి వెంకట కామేశ్వరరావుగారును, శ్రీయుత కందర్ప రామకృష్ణమూర్తి గారునూ ఏలూరులోనూ, శ్రీయుత సోమంచి లింగయ్యగారు పెంటపాడులోనూ, శ్రీయుత ఆచంట సుబ్బారాయుడుగారు తణుకులోనూ, శ్రీయుత జోశ్యుల వెంకట్రావుగారు పాలకొల్లులోనూ ఆనాటి సాయంకాలము స్కౌటు ఉద్యమములో జరుగనున్న మార్పుల గురించి ఉపన్యసించిరి.

# The Madras Elementary Education Act.



## Section 8

అధికారములో నుండు కాలము.—

(1) ఈ శ్సెక్షన్‌లోనూ, 10 వ శ్సెక్షన్‌లోనున్న నిబంధనలకు లోబడి ప్రతి మెంబరు షిప్పునూ ఫోర్టుసెంటు జార్జి గెజిట్‌లో ప్రచురింపబడిన తేదీలగాయతు మూడేండ్లవరకునూ అమలులో నుండును, లేదా ఏదైన ఒక ఖాళీ పూర్తిచేయుటకు ఎన్నుకొనబడిన మెంబరుషిప్పు అయిన యెడల అట్టి ఖాళీ ప్రచురణ తేదీకిలోపునే వచ్చినయెడల ఖాళీఅయిన రోజునుండియే అమలులోనికి వచ్చును.

లోకల్ అథారిటీనుండి ఎన్నుకొనబడిన కౌన్సిలు మెంబరు విషయములో, లోకల్ అథారిటీలోని మెంబరు షిప్పు ఆఖరుకాగానే, తిరిగి లోకల్ అథారిటీకి క్రొత్తగా మెంబరుగా ఎన్నుకొనబడి అట్టి మెంబరుషిప్పు పూర్వపు లోకల్ అథారిటీ యొక్క కాలము పూర్తికాగానే అమలులోనికి వచ్చినతప్ప, కౌన్సిలు మెంబరుషిప్పుకూడా ఆఖరగును.

ఎలెక్టు కాబడిగాని, నామినేషను కాబడిగాని వచ్చిన మెంబరు ex-officio మెంబరు అగుట తటస్థించిన యెడల పూర్వపు మామూలు మెంబరుషిప్పు హక్కులను చలాయించుటకు వీలుండదు.

(2) జిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిలు యొక్క ప్రెశిడెంటుగాని, వైస్ ప్రెశిడెంటుగాని తమకు కౌన్సిలుయొక్క మెంబరుషిప్పు ఉన్నంతకాలమే ఆయాపదవులహక్కులను చలాయించవలెను.

కాని ఎలెక్టుకాబడిన లేదా నామినేషను కాబడినమెంబరు ప్రెశిడెంటు పదవినిగాని, వైస్ ప్రెశిడెంటు పదవినిగాని చలాయించుచుండగా ex-officio మెంబరగుట తటస్థించిన ఆకౌన్సిలు కాలములో మిగిలిపోయిన భాగముకూడా తన పదవిని చలాయించవచ్చును.

## Section 9.

అధికారమునకు రాజీనామా:—

(1) జిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిలుకు వైస్‌ప్రెశిడెంటుగాని, మెంబరుగాని, రాజీనామా నివ్వదలచినయెడల ముందుగా వ్రాతమూలములో ప్రెశిడెంటుకు తెలియపరచవలెను. ప్రెశిడెంటే రాజీనామా నివ్వదలచిన పైవిధముగా కౌన్సిలుకు తెలియపరచవలెను.

(2) జీతము తీసికొను గవర్నమెంటు ఆఫీసరు జిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిలుకుమెంబరుగా నున్న, ఆయనవిషయములో, 3 నెలలకు పైగా కౌన్సిలు జ్యూరిస్ డిక్షన్‌దాటి వెళ్ళవలసివచ్చిననూ, లేదా గవర్నమెంటు ఉద్యోగమునకు రాజీనామా ఇచ్చిననూ, లేదా తీసివేయబడిననూ, లేదా రిటైరు అయిననూ, కౌన్సిలుకు మెంబరుగా నుండనేరడు.

## Section 10.

అధికారమునుండి తొలగించుట.—

(1) గవర్నమెంటువారు ప్రచురణద్వారా జిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిలుయొక్క ప్రెశిడెంటునుగాని, వైస్ ప్రెశిడెంటునుకాని, మెంబరునుగాని, ఈ క్రింది సందర్భములలో తీసివేయవచ్చును.

(a) కౌన్సిలుయొక్క అధికారమునకు లోబడిన ప్రదేశములో లేకుండా 3 నెలలకుపైగా నున్ననూ, లేదా విధిని నెఱవేర్చుట మానిననూ, లేదా మానవలసి వచ్చినంత అశక్తుడైననూ, లేదా దివాలాతీసిననూ, లేదా గవర్నమెంటువారి అభిప్రాయములో ఆహోదాలకు తగని లోటు శీలముగా ఉన్నదని ఏక్రిమినలు కోర్టైననూ స్థిరపరచిననూ,

(b) గవర్నమెంటువారి అభిప్రాయములో అవుసరమైనంత కారణములేకుండా రెండు కంటె ఎక్కువ మీటింగులకు హాజరు కాకపోయిననూ,

(2) పై విధములుగా తీసివేయబడినవారు తిరిగి ఎంతకాలమువరకు ఎలెక్షనుల పాల్గొన కూడదో గవర్నమెంటువారే నిశ్చయింతురు

## Section 11.

జీతములు — జిల్లాఎడ్యుకేషనల్ కౌన్సిలుయొక్క ఏమెంబరుగాని, ఎట్టివిధమయిన జీతమునుగాని, ప్రతిఫలమునుగాని కౌన్సిలు ఫండునుండి తీసికొనరాదు.

## Section 12

కౌన్సిలుయొక్క అర్హత — ప్రతిజిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిలునూ అట్టిపేరుతో నున్నట్టియు, ఒకప్రత్యేకస్థలమునకు చెందినట్టియు, విడదీయుటకు వీలుకానట్టియు ఉమ్మడిసంస్థ, ఒకేముద్రతోనూ, అంతముగాని వారసత్వముతోనూ, స్థిరాస్తిగాని చరాస్తిగాని కలిగియుండు అర్హతలతోనూ, స్థిరపరుపబడు నిబంధనలకులోబడి అట్టిఆస్తులను ఇంకొకరికి ట్రాన్సుఫరు చేయుటకుగాని, దానియొక్క నిర్మాణమునకు అవుసరమయిన మరియే యితరపనులను చేయుటకుగాని, ఉమ్మడి సంస్థపేరుతో ఒకరిమీద దావాచేయుటకుగాని, మరొకరిచే అట్లు చేయబడుటకుగాని, హక్కులతో నూ యీసంఘము నిర్మాణమగుచున్నది.

[స్థిరాస్తి విషయములో, ఖరీదు రు 500/- కు మించేయెడల, గవర్నమెంటు వారిచ్చుబోవు ఆమోదనకు లోబడి, జిల్లాఎడ్యుకేషనల్ కౌన్సిలు అట్టి ఆస్థిని క్రయముచేసిగాని, తణఖాపెట్టిగాని, ఫిరాయింపుచేసిగాని, ట్రాన్సుఫరు చేయుటకు హక్కుకలిగియుండును పైనుదహరింపబడినట్టి ట్రాన్సుఫరులైనను, లేదా అద్దెకిచ్చుటకై చేసిన ట్రాన్సుఫరుఅయిననూ, మరేవిధమయిన ట్రాన్సుఫరుఅయిననూ, జిల్లాకలెక్టరు అద్దెనుగాని, యసెస్సుమెంటునుగాని, స్థిరపరచుటకునూ, అట్టి అద్దె, అసెస్సుమెంటులను ప్రతిసంవత్సరమునూ మార్చుటకునూ హక్కు కలిగియుండును ]

## Section 13.

కౌన్సిలుఆఫీసు-సభలు:— ప్రతిజిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిలునకునూ ఒక ప్రత్యేక అఫీసు ఉండితీరవలెను. తాను స్థిరపరచిన కాలములలో కౌన్సిలు తనపనిని వ్యవహరించుకొనుటకు కూడుచుండవలెను. మరియు ప్రెశిడెంటుగాని, ఆయన లేనప్పుడు వైస్‌ప్రెశిడెంటుగాని సమావేశ పరచినప్పుడెల్ల కౌన్సిలు కూడుచుండవలెను.

అథమము రెండేసి నెలలనొకసారి అయిననూ జిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిలు సమావేశము కావలెను.

## Section 14.

మెంబర్లు కోరినమీదట సభలు.—

కౌన్సిలు మెంబర్ల సంఖ్యలో 3 వ వంతునకు తక్కువకాకుండా నున్నంతమంది వ్రాత మూలముగ కోరినమీదట ప్రెశిడెంటుగాని లేదా, ఆయన లేనప్పుడు వైస్ ప్రశిడెంటుగాని కౌన్సి

లును సమావేశపరుపవలెను. అధమము 6 రోజుల పూర్వమే, మీటింగు తేదీ, స్థలము, ఉద్దేశ్యము, మెంబర్లందరకు తెలియజేయబడనిదే కౌన్సిలు మీటింగు జరుపబడరాదు.

## Section 15.

సభాధ్యక్షుడు.—

(1) ప్రతి జిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిలు మీటింగునకును, ప్రెశిడెంటు, ఆయన లేనప్పుడు వైస్ ప్రెశిడెంటు సభకు అధ్యక్షత వహింపవలెను.

(2) మీటింగునకు ప్రెశిడెంటునూ, వైస్ ప్రెశిడెంటునూ కూడ హాజరు కానియెడల, అక్కడ సమావేశమైన మెంబర్లు తమలో నొకరిని అధ్యక్షుడుగా ఎన్నుకొనవలెను.

## Section 16.

మీటింగులు బహిరంగముగానే:—

జిల్లాఎడ్యుకేషనల్ కౌన్సిలుయొక్క మీటింగులన్నియు బహిరంగముగానే జరుగవలెను. అయినను సభాధ్యక్షుడు, ప్రత్యేకసందర్భములలో, కారణములను రికార్డుచేసి హాజరైన యితరులనందరినిగాని, లేదా, వారిలో యొకరినిగాని బయటికి పోవలసినదిగా ఆజ్ఞాపించవచ్చును.

## Section 17.

సభను జరుపు విధానము:—

(1) అప్పటికున్న కౌన్సిలు మెంబర్ల సంఖ్యలో అధమము 3 వ వంతైనను హాజరు కానిదే సభను జరుపరాదు.

(2) ప్రచురింపబడిన మీటింగు కాలమునకు అరగంటలోగా అవసరమైనంతమంది మెంబర్లు రానియెడల ప్రెశిడెంటుగాని, వారు లేనప్పుడు వైస్ ప్రెశిడెంటుగాని మీటింగును మరొక తేదీకి మార్చవచ్చును.

(3) జిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిలులో చర్చింపబడిన అన్నివిషయములునూ వోటుకు వేయబడి, మెజారిటి వోట్లతో పరిష్కారము కాబడవలెను, ఒకవేళ ఓట్లు వేయగా అనుకూలురును, ప్రతికూలురును సమానమైన యెడల అధ్యక్షునకు తిరిగి రెండవసారి పరిష్కారపు ఓటును వేయుటకు హక్కుండును.

(4) మెంబర్లందరకును సర్వసామాన్యముగా వర్తించినదయిన తప్ప, తనకే వర్తించిన డబ్బు విషయమైనప్పుడు, అట్టి మెంబరున, అట్టి తీర్మానము మీద ఓటుచేయ నీయబడరాదు.

(5) అందులకై ప్రత్యేకముగా పిలిపింపబడిన, అప్పటికి కౌన్సిలులో ఉన్న సంఖ్యలో సగమునుండి అయినను ఒప్పుకొన్న తప్ప, జిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిలులో ఒకసారి ఆమోదింపబడిన తీర్మానమును దిద్దుటగాని, కొట్టివేయుటగాని 3 నెలలలోపల చేయబడరాదు.

## Section 18

సభల కార్యక్రమములు:—

(1) జిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిలు సభలలో జరిగిన విషయములన్నియు, ప్రత్యేకముగా నుంచబడిన, ఒక పుస్తకములో ఎప్పటికప్పుడు వ్రాయబడి, ఆసభకు అధ్యక్షత వహించిన వారివల్ల సంతకము చేయబడి, సక్రమమైన కాలములందు ఉచితముగా ఎవరికవసరమైనవారు చూచికొనుటకు వీలుగ కౌన్సిలు ఆఫీసులో నుంచబడవలెను.



"సరస్వతీ నమస్తుభ్యమ్ వరదే కామరూపిణి
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా"

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య.

15 నవంబరు 1937.

## హిందీ సమస్య.

ఆవశ్యకత — హిందీ నేర్చుకొనుటవసరమా, కాదా యని చర్చించు కాలము దాటినది భారతీయులందరు నొకరితో నొకరు తేలికగ సంభాషించు కొనగలిగి, ఐక్యతతోను, ఏకభావము, ఏకలక్ష్యములతో నుండుట నవసరమని యెవ్వరన గలరు? 35 కోట్ల భారతీయులలో సుమారు 25 కోట్ల మందికి పరిచయముగల హిందీని కాక మరే భాషను దేశభాషగా చేయగలము? దేశమునకేకభాషతప్పదు, అది హిందీకాకతప్పదు.

ప్రచారము — హిందీని భారతీయుల కందరకు సామాన్య భాషగ చేయవలసిన యవసరమును గుర్తించిన కాంగ్రెసు వాదులు, హిందీ ప్రచారసంఘముల ద్వారా, హిందీ ప్రచారకులద్వారా ప్రత్యేకముగ మన దక్షిణహిందూస్థానమున, అందునను ముఖ్యముగ మన ఆంధ్రదేశమున అనేక వేలమందికి హిందీని నేర్పింప గలిగినారు. హిందీవారము ఏటేట జయప్రదముగా జరుగుచున్నది ప్రచారకులచే హిందీ నాటకము లాడబడుచున్నవి. హిందీ ప్రేమీ సంఘములు స్థాపింపబడుచున్నవి. నాయకులచే హిందీని ఉపన్యాసము లీయబడుచున్నవి. ఇంగ్లీషున మాట్లాడుటయందయిష్టమును, హిందీని తప్పులతోనైనను రెండుమాటలుచ్చరించగలుగుటయందుత్సాహమును ప్రజలలో ప్రబలుచున్నది.

నిర్బంధ విధానము — హిందీ యొక్క ఆవశ్యకతను బాగుగ గుర్తించి, చేత నధికారము లేకయున్నప్పుడే ప్రబల ప్రచారమును చేయగలిగిన కాంగ్రెసు వాదులు మంత్రిత్వము వడసి దేశపాలనాధికారమును చూరగొనిన యీదినములలో వారు పాఠశాలలో హిందీని ప్రవేశపెట్ట సమకట్టుట నుచితమనియు, దేశమున కంతకు ప్రళయకారణమనియు ఆందోళన చేయువారి నేమనవలెనో తెలియకున్నది.

1, 2, 3 ఫారములలో నిర్బంధ మెందులకును వారు మొదట తమ పిల్లలను 6 వ యేట నిర్బంధముగా బడికెందులకు పంపుచున్నామని యోచించు కొందురుగాక! ఆవశ్యకత స్థిరపడిన తరువాత విధానము నిర్బంధముగ జేయుటలో తప్పులేదు.

వ్రాతలిపి — ఇదియే నిజమైన ప్రస్తుత సమస్య. ఆంధ్రులందరును తీవ్రమైన ఆందోళన చేయవలసిన విషయము ఏక భాష దేశమునకెట్లవసరమో అట్లే ఏక లిపికూడ ఉండుటవసరము. అట్టి ఏక లిపి దేశములోని అన్ని భాషలకును కూడ వర్తింప జేయుట పరమోత్తమ పద్ధతి. ఏక లిపి ఇంతవరకును కనిపెట్టబడలేదు.

ప్రస్తుతము దేవనాగరిలిపిలోగాని, ఉర్దూలిపిలోగాని హిందీని మన రాజధానిలో నేర్పింప ప్రయత్నములు జరుగుచున్నవి. ఈరెంటిలో నేది అయిననూ 1 ఫారం కుర్రవానికి క్రొత్తగనే ఉండును. భాషమాటటుంచి, లిపినిమాత్రము స్వాధీనముచేసి కొనుటకే ఎంతో కాలము వృధా కాక తప్పదు. శ్రమ విషయలో వేరుగ చెప్ప నక్కరలేదు. కష్టపడి ఉర్దూలిపినిగాని, దేవనాగరిలిపినిగాని స్వాధీనముచేసికొని, తద్వారా హిందీ భాష నభ్యసింప బోవుట చేతిని అష్టవంకరలుగ త్రిప్పి ముక్కును చూపుట వంటిది.

లిపిపదైననూ, స్వచ్ఛముగా నందరితో మాటలాడగలుగుట మాత్రమే ముఖ్యావసరము.

అందుచేత శాస్త్రప్రకారము దేవనాగరి లిపిలోనే హిందీని నేర్పనక్కరలేదు. తెలుగు లిపిలోనే హిందీని నేర్పిన తప్పేమియులేదు. పైగా ఎంతో తేలికగానూ, త్వరగానూ హిందీని నేర్చుకొనుటకు వీలున్నది.

దేవనాగరి లిపి చెడ్డదని ఎవ్వరునూ అనరు అది మంచిదే. అది నేర్చినయెడల సంస్కృతమునకు కూడ పనికివచ్చును కాని ఆలిపి ఏమియు తెలియకుండా వేదములను, శాస్త్రములను తెలుగులిపిలో చదివి అర్థముతోసహా వాటిని స్వాధీనముచేసిన వారెంతమంది లేరు? భగవద్గీత తెలుగు లిపితో వ్రాసినది ఎక్కువమంది వాడుచున్నారా? దేవనాగరి లిపిలోనున్నదానిని ఎక్కువమంది వాడుచున్నారా? ఒకవేళ ఈ లిపిని చదువుట స్వాధీనమయిననూ వ్రాయుట బహుకష్టము. ఇందుకొక ఉదాహరణ. తెలుగు అంకెలు చాలమందికి తెలియును. కాని ఆ అంకెలతో అట్టివారందరును గుణకార భాగహారములను చేయగలుగుచున్నారా?

తెలుగు లిపిలో ఒక్క హిందీనేకాదు, అన్ని భాషలను తేలికగ వ్రాయగలము. మన ఆంధ్ర భాషలో అన్నిరకముల అక్షరములున్నవి. అఱవములో అట్లుకాదు. దానిలో అక్షరములు తక్కువ. హిందీలో వచ్చు ధ్వనులనన్నిటిని అఱవములో వ్రాయుట కష్టము. తెలుగులో బహు తేలిక "మైజాతాహుం" అని తెలుగు లిపిలో హిందీని వ్రాసిన, నేర్చుకొను విద్యార్థియొక్క మనస్సు అర్థముమీదనే ఎక్కువగా నిలుపుటకు వీలిచ్చు లిపి ఎంతమాత్రమును అడ్డమురాదు. అఱవవారికి వారి లిపిలో హిందీని నేర్చుకొను భాగ్యములేనేలేదు. ఆంధ్రులకు అట్టి వీలున్నప్పుడు ఆ అవకాశమును పోగొట్టుకొనుట వెర్రితనము.

### వార్ధా సమావేశము.

అక్కడ జరిగిన సంగతులన్నియు తెలిసికొని వచ్చిన మన మంత్రులైన గా॥ రామనాథన్ గారును, గా॥ సుబ్బరాయను గారును అక్కడక్కడ జరిగిన సభలలో తాత్కాలికముగ చెప్పిన మాటలు తప్ప మరేమియును ఆ సభనుగురించి మనకు తెలియకున్నది. 7 సంవత్సరముల నిర్బంధోచిత విద్యను గవర్నమెంటువారి యాజమాన్యమున ఇచ్చునట్లును, అట్టి విద్య పరిసరప్రదేశములలోని పరిశ్రమల మీద నాధారపడి యుండునట్లును, విద్యార్థులు చేతిపనులు చేసి సంపాదించిన పైకముమీదనే స్కూలు ఆధారపడి యుండునట్లును ఏర్పాట్లు జరుగుచున్నట్లు తెలియుచున్నది.

ఇప్పుడు మనదేశములో అక్కడక్కడ ఇచ్చుచున్న నిర్బంధవిద్య 5 ఏండ్లు మాత్రమే. గాంధీగారు దానిని 7 సంవత్సరములు చేసినారు. ఇంగ్లాండులో 14 ఏండ్ల నిర్బంధవిద్య అమలులో నున్నట్లు తెలియుచున్నది. ఆ స్థితికి మన మింతలో రాలేము.

పిల్లలుచేసిన చేతిపనులమీద స్కూలు నడుపుట శోచనీయముగనే ఉన్నది. గాంధీగారి యభిప్రాయములో కూడ మొదటి రెండు సంవత్సరములలో నష్టము వచ్చును ఆ తర్వాత సంవత్సరములలో ఖర్చులుపోను మొదటి సంవత్సరములో వచ్చిన నష్టమునుకూడ దీయునంత లాభము వచ్చునని ఆయన సభలో తెలిపియున్నారు. గాంధీగారి అభిప్రాయములో బిల్డింగు, ఎక్విప్మెంటు ఖర్చులు గవర్నమెంటువారే భరించవలెను. ఉపాధ్యాయుల జీతములు, ఇతరములైన రికరింగు ఖర్చులు చేతిపనుల మీద ఆధారపడి యుండవలెనని వారి యభిప్రాయము.

మహాత్ముని స్కీమునకు సిలబస్ తయారుచేయుట బహుకష్టమైనపని. ఈ పనికి పూనుకొనిన వారు గొప్పగొప్ప విద్యావేత్తలు. వారి సిలబస్ నకై విద్యా ప్రపంచ మంతయు కనిపెట్టుకొని యున్నది.

## రామా పద్యవాచకములు.

కె హెచ్. వి యస్ నారాయణ, బి ఏ., యల్ టి.
శేషాద్రిరమణకవులు, శతావధానులు గార్లచే

| | | |
|---|---|---|
| మొదటి తరగతి | . | 0 1 6 |
| రెండవ తరగతి | .. . | 0 1 6 |
| మూడవ తరగతి | | 0 2 0 |
| నాల్గవ తరగతి | | 0 2 0 |
| ఐదవ తరగతి | | 0 2 6 |

చిన్నకోట వెంకట రంగారావు బి ఎ, ఎల్ టి, గారిచే

| | | |
|---|---|---|
| ఆఱవ తరగతి | ... | 0 3 0 |
| ఏడవ తరగతి | | 0 4 0 |
| ఎనిమిదవ తరగతి | | 0 6 0 |

## రామా గణితదర్పణములు.

గిడుగు వేంకటరామమూర్తి, బి ఎ ఎల్ టి
తోపల్లి వెంకటప్పయ్య, బి ఎ ఎల్ టి గార్లచే వ్రాయబడి
(యస్ గోపాలం బి ఎ ఎల్ టి గారిచే రివైజు చేయబడినవి).

| | | | |
|---|---|---|---|
| మొదటి తరగతి | . | | 0 3 0 |
| రెండవ తరగతి | ... | . | 0 5 0 |
| మూడవ తరగతి | | . | 0 7 0 |
| నాల్గవ తరగతి | .. | . | 0 10 0 |
| ఐదవ తరగతి | ... | ... | 0 12 0 |



## రామాహితోపదేశ వాచకములు.

విద్వాన్ గరిమెళ్ళ సోమన్న పంతులుగారు, యం ఎ యల్ టి గారిచే

| | |
|---|---|
| రెండవ తరగతి | 0 2 0 |
| మూడవ తరగతి | 0 3 0 |
| నాల్గవ తరగతి | 0 4 0 |
| ఐదవ తరగతి | 0 5 0 |

## రామా సివిక్సు పాఠములు.

బి లక్ష్మీనారాయణశాస్త్రి, ఎం ఏ (ఆనర్సు) ఎల్ టి గారిచే

| | | |
|---|---|---|
| రెండవ తరగతి | | 0 2 6 |
| మూడవ తరగతి | .. | 0 3 0 |
| నాల్గవ తరగతి | | 0 4 0 |
| అయిదవ తరగతి | ... | 0 5 0 |

మహాకాళి సుబ్బారాయుడు గారిచే

| | | |
|---|---|---|
| సివిక్సు వ్యాస్యాయలు 4, 5, తరగతులకు | .. | 0 6 0 |

## రామా ప్రకృతి శాస్త్ర వాచకము.

Dr. వేపా వరాహ నరసింహంగారు, యం ఏ,
తెంపెల్లి సూర్యనారాయణమూర్తిగారు, డి ఐ ఆఫ్ స్కూల్సు గారిచే

| | | | |
|---|---|---|---|
| రెండవ తరగతి | | ... | 0 3 0 |
| మూడవ తరగతి | | | 0 4 0 |
| నాల్గవ తరగతి | | | 0 5 0 |
| ఐదవ తరగతి | . | ... | 0 6 0 |

# రామా గుణిత బోధినీలు.

ప్రాథమిక పాఠశాలల తరగతుల బాలురకు వర్ణక్రమమును నేర్పుట
కీపుస్తకములు మిగుల యుపయుక్తములు

| | |
|---|---|
| మొదటి భాగము .. | 0 1 6 |
| రెండవ భాగము | 0 2 0 |
| మూడవ భాగము | 0 2 0 |
| నాల్గవ భాగము | 0 2 0 |

# రామా పురాణపాఠములు.

మల్లాది సూర్యనారాయణ శాస్త్రి గారిచే
డాక్టరు వేపా వరాహనరసింహము పంతులు, ఎం ఎ, గారిచే
పరిష్కరింపబడినవి

| | |
|---|---|
| మొదటి తరగతి | 0 2 6 |
| రెండవ తరగతి | 0 2 6 |
| మూడవ తరగతి | 0 3 0 |
| నాల్గవ తరగతి | 0 4 0 |
| ఐదవ తరగతి | 0 5 0 |

# రామా లోకజ్ఞానములు.

గిడుగు వేంకట రామమూర్తిగారు, బి ఏ, యల్ టి, గారిచే.

| | |
|---|---|
| రెండవ తరగతి | 0 3 0 |
| మూడవ తరగతి .. | 0 4 0 |
| నాల్గవ తరగతి | 0 5 0 |
| అయిదవ తరగతి | 0 8 0 |
| 2, 3, 4 తరగతులకు ఒకేబుక్కు | 0 10 0 |



# రామా జిల్లా భూగోళములు.

విద్వాన్ గరిమెళ్ళ సోమన్న పంతులు, ఎం ఏ, ఎల్. టి, గారిచే

విశాఖపట్నం, తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణ, గంటూరు, నెల్లూరు, కర్నూలు, కడప, బళ్ళారి, అనంతపురం, చిత్తూరు, జిల్లాల భూగోళములు ప్రతిజిల్లా భూగోళం 1కి 0 4 0

కొత్తపద్ధతి ననుసరించి
మండలేముల వెంకటశాస్త్రి బి ఏ, ఎల్ టి గారిచే

1 గంజాంజిల్లా భూగోళము 0 4 0

ఉ సత్యనారాయణ డిప్యూటి ఇన్స్పెక్టరు యం ఏ, ఎల్ టి గారిచే.

2 విశాఖపట్నంజిల్లా భూగోళం 0 6 0

ఫార్థి రాఘవేంద్రరావు, బి ఏ, గారిచే

3 తూర్పుగోదావరి జిల్లాకథ 0 6 0

డి సత్యనారాయణమూర్తి గారిచే, బి ఏ, ఎల్ టి,

4 పశ్చిమ గోదావరి జిల్లా భూగోళం 0 6 0

5 గుంటూరుజిల్లా భూగోళం 0 4 0

యస్ లక్ష్మీనరస్సయ్యగారు యం ఏ, ఎల్ టి, గారిచే

6 కర్నూలుజిల్లా భూగోళం .. 0 4 0

యం వెంకటసుబ్బయ్య గారిచే,

7 కడపజిల్లా భూగోళం . 0 4 0

మండా కృష్ణమూర్తి గారిచే,

8 ఏజన్సీ భూగోళం 0 4 0

# రామా నాటకముల కథలు.

వి సుబ్బారాయుడు & యమ్ సుబ్బారాయుడు గార్లచే,

| | | | |
|---|---|---|---|
| మొదటి తరగతి | 0 2 0 | నాల్గవ తరగతి | 0 4 0 |
| రెండవ తరగతి | 0 2 0 | ఐదవ తరగతి | 0 5 0 |
| మూడవ తరగతి | 0 3 0 | | |

## జాగ్రఫీలు.

ఆర్. శేషగిరిరావు, బి. ఏ, యల్. టి. గారిచే

| | | |
|---|---|---|
| మొదటిఫారం 6 వ తరగతికి | ... | 0 8 0 |
| రెండవఫారం 7 వ తరగతికి | ... | 0 10 0 |
| మూడవఫారం 8 వ తరగతికి | ... | 0 12 0 |

నాల్గవ ఫారముకు, (బి. రామచంద్రరావు, ఎమ్. ఏ., ఎల్. టి. గారిచే) యం సీతారామాచార్యులు, బి. ఎ., ఎల్. టి., గారిచే వ్రాయబడిన

| | | |
|---|---|---|
| చెన్నపురి రాజధాని భూగోళం | ... | 0 6 0 |

### రామాజాగ్రఫీ మ్యాపుడ్రాయింగు బుక్కులు.

(నవీన పద్ధతులననుసరించి నూతన ప్రణాళికొను గుణ్యముగ తయారు చేయబడినవి.)

| | | | |
|---|---|---|---|
| 5 వ తరగతికి | 0 3 0 | 3 వ ఫారము | 0 6 0 |
| 1 వ ఫారము | 0 6 0 | ట్రయినింగు స్కూళ్ళకు | 0 6 0 |
| 2 వ ఫారము | 0 6 0 | | |

## రామా గణిత సారములు.

ఆర్. వీరభద్రరావు బి ఏ., ఎల్. టి. గారిచే వ్రాయబడి

(కె. వి. సుబ్బారావు, బి ఏ, యల్.టి గారిచే రివైజు చేయబడినవి.)

| | | |
|---|---|---|
| నాల్గవ తరగతి | ... ... | 0 8 0 |
| అయిదవ తరగతి | .. ... | 0 10 0 |
| తెలుగు లెక్కలబుక్కు (పుట్లు, వెరసులవగైరా) | .. | 0 4 0 |
| నోటిలెక్కలబుక్కు 2-5 తరగతుల వరకు | ... | 0 4 0 |
| గణితబోధిని (ఎక్కములు, మానములు) | ... | 0 1 0 |



## రామా తాలూకా భూగోళములు.

| | | |
|---|---|---|
| తిరువూరు తాలూకా భూగోళం | ... | 0 3 0 |
| తెనాలి తాలూకా చరిత్ర భూగోళం | ... | 0 3 0 |
| బాపట్ల తాలూకా చరిత్ర భూగోళం | ... | 0 2 6 |
| గుంటూరు తాలూకా చరిత్ర భూగోళం | ... | 0 2 6 |
| గుత్తి తాలూకా భూగోళం | ... | 0 2 6 |
| కంభం తాలూకా భూగోళం | .. | 0 3 0 |
| ఏలూరు తాలూకా భూగోళం | ... | 0 2 6 |
| నంద్యాల తాలూకా భూగోళం | .. | 0 2 0 |

## రామా హిందూదేశ చరిత్రలు.

వురిటి రామమూర్తి గారిచే వ్రాయబడి,

జి. రంగారావునాయుడు, బి ఎ., ఎల్. టి. గారిచే సరిచూడబడినవి.

| | | |
|---|---|---|
| రామా హిందూదేశ చరిత్ర 4 త॥ | .. | 0 4 0 |
| హిందూదేశ చరిత్ర 5 త॥ | .. | 0 5 0 |

జి. వి. సీతాపతి, బి. ఏ., ఎల్. టి., గారిచే

| | | |
|---|---|---|
| మొదటి ఫారం 6 వ తరగతికి | ... | 0 8 0 |
| రెండవ ఫారం 7 వ తరగతికి | ... | 0 10 0 |
| మూడవ ఫారం 8 వ తరగతికి | ... | 0 12 0 |

మునిమాణిక్యం నరసింహారావు, బి. ఎ., ఎల్. టి. గారిచే

| | | |
|---|---|---|
| కృష్ణామండల చరిత్ర | .. | 0 3 0 |

## ప్రథమ పాఠశాలారోగ్య బోధిని.

శిష్టా గోపాలం బి. ఎ., ఎల్. టి. గారిచే వ్రాయబడినది

| | | |
|---|---|---|
| 2, 3 తరగతులకు | ... | 0 2 0 |
| 4, 5 తరగతులకు | ... | 0 4 0 |

# తెలుగు. టెక్స్టు బుక్కు ఆఫ్ అరిథ్ మెటిక్.

యస్. రాధాకృష్ణఅయ్యర్, బి ఏ.,
కే. వైద్యనాథస్వామి అయ్యర్, బి, ఎ గార్లచే, (కె రంగాచారి
ఎం., ఏ బి యల్. యల్. టి విజయనగరము వారిచే సవరింపఁబడినవి)

| | |
|---|---|
| మొదటి ఫారమునకు | 0 10 0 |
| రెండవ ఫారమునకు | 0 10 0 |
| మూడవ ఫారమునకు | 0 10 0 |

జే. గంగాధరం బి ఏ ఎల్ టి గారిచే

| | |
|---|---|
| నాల్గవ ఫారమునకు | 1 0 0 |

# ఉపాఖ్యానములు - నిఘంటువులు.

| | |
|---|---|
| నీతిశాస్త్రము టీక | 0 2 0 |
| ఆంధ్రనామసంగ్రహము | |
| మూలము | 0 2 0 |
| డిటో టీక | 0 6 0 |
| ఆంధ్రనిఘంటుత్రయము | |
| శేపరు | 0 8 0 |
| డిటో అట్ట | 0 10 0 |
| డిటో క్యాలికో | 0 14 0 |
| ప్రహ్లాద చరిత్ర సప్తమ | |
| స్కంధము | 0 6 0 |
| కుచేలోపాఖ్యానము (పోతన) | |
| డిటో టీక | 0 4 0 |
| నలోపాఖ్యానము టీక | 0 6 0 |
| కుచేలోపాఖ్యానము | |
| (గట్టుప్రభువు) | 0 6 0 |
| భర్తృహరి సుభాషితము | |
| (నీతిశతకము) | 0 4 0 |
| అమరకోశము ప్రథమకాండము | |
| మూలము | 0 2 0 |
| డిటో డిటో టీక | 0 6 0 |
| అమరము త్రికాండము అట్ట | 1 0 0 |
| డిటో క్యాలికో | 1 12 0 |
| మొల్ల రామాయణము | 0 8 0 |
| ధర్మసూక్ష్మము | |
| (పద్యకావ్యము) | 0 4 0 |



# రామా శాస్త్ర వాచకములు.

టి వి నరసింగరావు ఎమ్, ఎ ఎల్. టి ప్రొఫెసర్
బి హెచ్ పట్టాభిరామయ్య యం. ఏ యల్. టి
సి భానుమూర్తి బి ఏ యల్ టి. గార్లచే.

| | |
|---|---|
| మొదటి ఫారము | 0 8 0 |
| రెండవ ఫారము | 0 8 0 |
| మూడవ ఫారము | 0 10 0 |

# రామా ఆంధ్రవ్యాకరణ పాఠములు.

యమ్ సి హెచ్ వెంకట రామానుజాచార్యులు గారిచే

| | |
|---|---|
| 4, 5 తరగతులకు | 0 3 0 |
| 1 వ ఫారమునకు | 0 4 0 |
| 2 వ ఫారమునకు | 0 4 0 |
| 3 వ ఫారమునకు | 0 4 0 |
| రామా ఆంధ్రవ్యాకరణ సర్వస్వము 4, 5, 6 ఫారములకు | |
| శేషాద్రి రమణ కవులచే | 0 10 0 |
| కర్తకర్మ క్రియా బోధిని | 0 0 6 |
| భాషాభాగ ప్రదీపిక | 0 [illegible] 6 |

ట్రెయినింగు స్కూళ్ళ పుస్తకములు.

| | |
|---|---|
| భూగోళశాస్త్రము (నూతనసిలబసు ననుసరించి) | 1 4 0 |
| లెక్కల పుస్తకము | 2 0 0 |
| న్యాచురలు ఫినామినా | 0 8 0 |
| యెలిమెంటరీ సైన్సు | 0 8 0 |
| సృష్టివిద్యా-తోటపని (వృక్షశాస్త్రము, జంతుశాస్త్రము & న్యాచురలు ఫినామినా కలిసి) | 1 4 0 |
| ఆంధ్రలక్ష్మీ చంద్రిక | 0 5 0 |
| సోషియాలజీ | 0 12 0 |
| పాఠక్రమ సూచిక | 0 8 0 |
| విద్యాబోధనా తత్వము | 0 12 0 |

# వివిధ గ్రంథములు.

| | | |
|---|---|---|
| అక్షరాభ్యాస సహకారికా చిత్రలేఖనము, మొదటిభాగం | | 0 2 0 |
| డిటో రెండవ భాగం | | 0 2 0 |
| మృగముల డ్రాయింగు బుక్కు | ... | 0 2 0 |
| పక్షుల డ్రాయింగు బుక్కు | ... | 0 2 0 |
| తెనాలి రామలింగని వింతకథలు | | 0 3 0 |
| వ్యవహారబోధిని మొదటిభాగం | .. | 0 4 0 |
| డిటో రెండవభాగం | ... | 0 4 0 |
| సృష్టిపరిశీలన (సేపూరిలక్ష్మీనరసయ్యగారిచే | . | 0 4 0 |
| ఇంగ్లీషు గృహోపాధ్యాయుడు Private Tutor of English) | . | 0 4 0 |
| ఇంగ్లీషు కాన్వయుశేష 4 త॥ | .. | 0 3 0 |
| డిటో 5 త॥ | ... | 0 4 0 |
| రామేశ్వర మజిలీకథలు | . | 0 12 0 |
| బ్రహ్మోత్తరఖండము—హరికథ | ... | 1 0 0 |
| రామకృష్ణజంత్రి 1, 2, 3, భాగములు | | 2 0 0 |
| డిటో 3 వ భాగముమాత్రము | . | 0 8 0 |
| కుశలవ నాటకము | .. | 0 12 0 |
| భగవద్గీత క్యాలికో బైండు-తాత్పర్యముతో | .. | 0 8 0 |
| డిటో సాదా బైండు | .. | 0 6 0 |
| అధ్యాత్మ రామాయణ కీర్తనలు | ... | 0 6 0 |
| డిటో క్యాలికో బైండు | . | 0 10 0 |



| | | |
|---|---|---|
| లలిత సహస్రనామము | .. | 0 6 0 |
| డిటో క్యాలికో బైండు | ... | 0 8 0 |
| శ్రీరామసహస్రనామస్తోత్రము | | 0 4 0 |
| విష్ణుసహస్రనామస్తోత్రము | .. | 0 4 0 |
| శ్రీలక్ష్మీ సహస్రనామస్తోత్రము | ... | 0 3 0 |
| శ్రీఆంజనేయ సహస్రనామస్తోత్రము | .. | 0 3 0 |
| శ్రీశివసహస్రనామస్తోత్రము | ... | 0 3 0 |
| శ్రీగణపతిసహస్రనామస్తోత్రము | .. | 0 3 0 |
| లక్ష్మీ నృసింహస్తోత్రము టీక | ... | 0 3 0 |
| భజగోవిందం | ... | 0 2 0 |
| మోక్షగుండరామాయణం (హరికథ) | ... | 2 8 0 |
| అష్టాదశ పురాణసారము 1, 2, 3, 4 భాగములు భాగము 1 కి | | 1 0 0 |
| అన్ని భాగములు కలిపి క్యాలికో | | 4 8 0 |
| హస్తసాముద్రికము | | 0 4 0 |
| శ్రీమదాంధ్ర మహాభారతము (వచనము) ఆది-సభాపర్వములు | | 2 0 0 |

## మున్నంగి శర్మగారి పరిష్కృతములు.

| | | |
|---|---|---|
| భాషీయదండకము | ... | 0 2 0 |
| చంద్రశేఖరశతకము | ... | 0 2 0 |
| ఉద్భ్రాంత స్వప్నము | ... | 0 2 0 |
| శ్రీమదాంధ్ర మహాభారతము (వాక్యవిరామాదుల తెలుపు గుర్తులతో) | | |
| శాంతిపర్వము | ... | 2 0 0 |

# సెకండరీస్కూళ్ళు



## ఉపవాచకములు.

| | | | |
|---|---|---|---|
| నీతిక దామంజరి 2, 3, 4, త॥ | 0 2 0 | యదువంశము | 0 8 0 |
| ఆంధ్రరాజులు | 0 3 0 | రఘువుల వీరులు | 0 8 0 |
| ఆంధ్రులు | 0 3 0 | దశావతారములు (బొమ్మలతో) | |
| ఉపాఖ్యాన రత్నావళి | 0 3 0 | | 0 8 0 |
| భోజ చరిత్ర | 0 4 0 | షట్చక్రవర్తులు | 0 8 0 |
| పర్వదినమహాత్మ్యము | 0 4 0 | పరశురాముని చరిత్ర | 0 8 0 |
| జాతీయకథావళి | 0 4 0 | రామాయణసారము | 0 8 0 |
| ప్రహ్లాద చరిత్ర | 0 4 0 | ఉత్తర రామాయణసారము | 0 8 0 |
| భీష్మమహిమ | 0 5 0 | రాజసూయము | 0 8 0 |
| పురాణచంద్రిక I భా॥ | 0 4 0 | ప్రతాపరుద్రుడు | 0 8 0 |
| డిటో II భా॥ | 0 6 0 | చారిత్రనాటకపంచకం | 0 8 0 |
| కథా రామాయణము | 0 6 0 | గద్యపద్యావళి | 0 8 0 |
| అభిమన్యుడు | 0 6 0 | కృష్ణవేణి | 0 8 0 |
| అజ్ఞాతవాసము | 0 6 0 | భారతసారము | 0 10 0 |
| నీతిచంద్రిక | 0 6 0 | భాగవతకథాసారము | 0 10 0 |
| రణతిక్కన చరిత్ర | 0 6 0 | తిన్నడు గుణనిధి | 0 10 0 |
| రుద్రమదేవి | 0 6 0 | బృహన్నల విజయము | 0 10 0 |
| శ్రీరామచంద్రమూర్తి | 0 6 0 | కల్పలత | 0 10 0 |
| కర్ణునిచరిత్ర | 0 8 0 | ఇందుమణి (నవల) | 0 12 0 |
| భీష్మచరిత్ర | 0 8 0 | హరివంశము | 0 12 0 |
| కురువంశము | 0 8 0 | పోటీపరీక్షావ్యాసములు | 1 0 0 |



## బాలుర కుపయుక్తమగు శతకములు.

| | | | | |
|---|---|---|---|---|
| సుమతిశతకము మూలము | 0 1 0 | నృసింహశతకం | టీక | 0 4 0 |
| డిటో టీక | 0 2 0 | వేమన శతకము మూలము | | 0 1 0 |
| కృష్ణశతకము మూలము | 0 1 0 | డిటో | టీక | 0 3 0 |
| డిటో టీక | 0 3 0 | బాలరామాయణము టీక | | 0 2 0 |
| కుమారశతకము మూలము | 0 1 6 | డిటో | మూలం | 0 1 0 |
| డిటో టీక | 0 3 0 | గజేంద్రమోక్షము మూలము | | 0 2 0 |
| దాశరథీశతకము మూలము | 0 1 0 | డిటో | టీక | 0 6 0 |
| డిటో టీక | 0 4 0 | డిటో క్యాలికోబైండు | | 0 8 0 |
| భాస్కర శతకం మూలము | 0 1 0 | రుక్మిణీకల్యాణం మూలము | | 0 2 0 |
| డిటో టీక | 0 4 0 | డిటో | టీక | 0 6 0 |
| నృసింహశతకం మూలము | 0 1 6 | డిటో క్యా॥ బైండు | | 0 8 0 |

### స్త్రీలకుపయుక్తమగు ఉపవాచకములు, శతకములు.

## సతీశిరోమణులు.

మహావాది వెంకటరత్నంగారిచే

| | | | |
|---|---|---|---|
| అభ్యాసపారం | 0 2 6 | నోముల కదలు | 0 4 0 |
| సతీశిరోమణులు 1 భా॥ | 0 3 0 | కుమారశతకము | 0 1 0 |
| ,, 2 భా॥ | 0 3 0 | డిటో టీక | 0 2 0 |
| ,, 3 భా॥ | 0 4 0 | సుదతి సునీతిశతకము | |
| ,, 4 భా॥ | 0 5 0 | మూలము | 0 1 6 |
| ,, 5 భా॥ | 0 6 0 | డిటో టీక | 0 3 0 |
| ,, 6 భా॥ | 0 6 0 | పూర్వహైందవ స్త్రీలచరిత్ర | |
| ,, 7 భా॥ | 0 6 0 | మొదటిభాగము | 0 3 0 |
| ,, 8 భా॥ | 0 6 0 | డిటో రెండవభాగం | 0 3 0 |
| ,, అభ్యాసవాచకం | 0 2 0 | రామా తెలుగుకాపీలు 1 2,3,4,5 | |
| భారతనారీమణులు | 0 6 0 | నెంబర్లు ఒక్కొకటి | 0 0 9 |
| అనసూయ | 0 4 0 | డజను 0-7-0 1గ్రోసు | 4 8 0 |

## స్కూల్ల రిజిష్టర్లు.

| | | | | |
|---|---|---|---|---|
| అటెండెన్సు రిజిష్టరు | | 12 పే॥ | .. | 0 2 0 |
| డిటో | డిటో | 24 పే॥ | | 0 4 0 |
| డిటో | డిటో | 36 పే॥ | . | 0 6 0 |
| డిటో | డిటో | 48 పే॥ | | 0 8 0 |
| డిటో | డిటో | 60 పే॥ | . | 0 10 0 |
| డిటో | డిటో | 72 పే॥ | ... | 0 12 0 |
| డిటో | డిటో | 84 పే॥ | ... | 0 14 0 |
| డిటో | డిటో | 1 0 పే॥ | .. | 1 0 0 |
| అడ్మిషను రిజిష్టరు | | 12 పే॥ | .. | 0 2 0 |
| డిటో | | 24 పే॥ | ... | 0 4 0 |
| అడ్మిషను ఫారములు | | 100 పే॥ | | 0 8 0 |
| టీచర్ల అటెండెన్సు రిజిష్టరు | | నెం 1 రు | ... | 0 2 0 |
| డిటో | | నెం 2 రు | .. | 0 3 0 |
| డిటో | | నెం 3 రు | | 0 4 0 |
| ప్రోగ్రెస్ కాండక్టు రిజి॥ | | 50 పే॥ | . | 0 3 0 |
| డిటో | | రిజి॥ 100 పే॥ | | 0 5 0 |
| డిటో | | రిజి॥ 150 పే॥ | ... | 0 7 0 |
| డిటో | | రిజి॥ 200 పే॥ | | 0 9 0 |
| లీవింగు సర్టిఫికెట్టు బుక్కు 25 ఫారములు డూప్లికేటుతో | | | | 0 2 0 |
| డిటో 50 ఫారములు డిటో | | | | 0 4 0 |
| అక్విటెన్సు రోలు | | | .. | 0 3 0 |
| విజిటర్సు బుక్కు | | | .. | 0 3 0 |
| ఫారెస్టు నమోనా రశీదు బుక్కు | | నెం 2 రు 50 పే॥ | | 0 6 0 |
| జనాభా రిజిష్టరు 50 పేజీలు | | | .. | 0 6 0 |
| డిటో | డిటో | 100 పే॥ | .. | 0 12 0 |
| డిటో | డిటో | 150 పే॥ | ... | 1 2 0 |
| డిటో | డిటో | 200 పే॥ | ... | 1 6 0 |



## రామా బొమ్మల పటములు. సైజు 10 × 15

15 జంతువులు, 10 పక్షులు, 4 వృక్షములు 3 పాములు, 3 పుష్పములు, 2 జల, 5 భూచర, సరీసృపములు (మొత్తం 45)

సృష్టిపరిశీలనా పాఠములు బోధించుటకు మిక్కిలి సహాయపడును ప్రతిఒకదానికి ముఖ్యాకారము (ప్రతి పటమునకును సంగ్రహచరిత్ర) స్పష్టముగ (వ్రాయబడిన) ఒడిగోడలకు వేసిన అందముగ నుండును

| | | | |
|---|---|---|---|
| ఒక్కొక్క పటము | 0 1 0 | 43 పటముల పూర్తి సెట్టు | 2 0 0 |
| డజను | 0 9 0 | డిటో బైండుచేసిన పుస్తకములు | 2 4 0 |

స్వాభావిక సిద్ధములైన ప్రకృతి దృష్టాంతములను నీతులను తెల్పుమా అట్టివానిలో ముఖ్యమగు యీక్రింద పేర్కొనిన వానిని పెద్ద అక్షరములతో గ్లేజు కాగితముల పైన ప్రత్యేకము ప్రాథమిక బడుల బాలబాలికల ప్రస్తుత విద్యా విధానమున కుపకరించునట్లు తయారు చేయించితిమి

[10″×15″ కు 15″×20″ సైజులలో ముద్రింపబడినవి.]

| | |
|---|---|
| 1 పంచరంగులు | 4 మాతృపంచకము |
| 2 పద్రసములు | 5 నవరసములు |
| 5 అష్టకష్టములు | 6 నవధాన్యములు |

ఒక్కొక్కటి 0—0—9 సెట్టు 0 — 3—0

ఈక్రింది సెట్టు ముద్రింపబడి సిద్ధముగా నున్నవి.

| | |
|---|---|
| 6 నీతివాక్యములు | 6 విధులు |
| 6 వ్యవసాయ సామెతలు | 12 ఆరోగ్యసూత్రములు |
| 6 నిత్యకృత్యములు | 12 నీతులు |

పై 48 నీతిసూత్రముల సెట్టు గ్లేజుకాగితములపైన 0-8-0

వలయువారు:—రామా అండ్ కో, ఏలూరు.